వేణువీణారవంబులు వేదనాద
ములును ఘంటాఘణత్కారములును శంఖ
నిస్స్వనంబులు దిక్కుల నిండె నపుడు. 230

సీ. కదళికాస్తంభసంగతచతుర్ద్వారంబు
పల్లవతోరణభ్రాజితంబు
హరితరాంకవవితానాలంకృతంబును
బహురంగవల్లికాభ్రాజితంబు
ఫలపుష్పమంజరీపరిమళోపేతంబు
దేదీప్యమానప్రదీపకంబు

... ... ... ... ...

తే. మణిమయం బైనకల్యాణమంటపమున
బృథులసౌవర్ణమయరత్నపీఠమునను
వెలయఁ గూర్చుండి నిషధభూవిభునిసాధ్వి
చిత్తమలరంగఁ బూజలు సేయుచుండె. 231

సీ. ధ్యానంబు గావించెఁ దరుణేందుమౌళికి
నావాహన మొనర్చె దైవపతికి
భద్రాసనం బిచ్చెఁ బార్వతీధవునకు
నర్ఘ్యం బొసంగెఁ గాలాంతకునకు
నభిషేకములు జగత్ప్రభునకు నొనరించె
వస్త్రయుగ్మము కృత్తివాసునకును
శ్రీగంధతిలకంబు శివునకు నలరించె
నక్షతంబులు జగద్రక్షకునకుఁ

తే. కుందమందారబిల్వమాకందవకుళ
చంపకాశోకపున్నాగజలజములను

బూజ లొనరించె రవికోటితేజునకును
సొరిది సీమంతినీభామ సుగుణధామ. 232

క. సౌరభ్యధూప మొసఁగెను
వారిధితూణీరునకును వైభవ మలరన్
నీరాజన మిచ్చెను క
ర్పూరముతోడను భుజంగభూషణధృతికిన్. 233

క. ధిషణావతియై మణిమయ
చషకంబున మధురభక్ష్యశాల్యోదనమున్
నిషధేంద్రపత్ని శివునకు
వృషభేంద్రతురంగునకు నివేదన మొసఁగెన్. 234

క. లక్షణవతి యగు నాసతి
నక్షత్రప్రహారతిచ్చె నవరత్నములన్
రక్షితలోకత్రయునకు
దక్షసుతాసహితునకు నతత్రాణునకున్. 235

తే. వంశపావని యాచిత్రవర్మపుత్రి
పుష్పములు దోయిట ఘటించి బుధులు దాను
మంత్రపుష్పంబు లొసఁగిరి మహితవృత్తిఁ
జంద్రమౌళికిఁ గారుణ్యసాంద్రమతికి. 236

క. మేరుశరాసనునకు బృం
దారకవినుతునకు సచ్చిదానందునకున్
గూరిమిఁ బ్రదక్షిణనమ
స్కారంబు లొనర్చె నపుడు గజగామినియున్. 237

చ. దురితవిపద్దశావ్యసనదుస్సహతాపభయాశుభాళి బం
ధురతరసంసృతిప్రకటదోషముల న్వదలించి ప్రోవుమీ

స్మరహర చంద్రశేఖర భుజంగవిభూషణయంచు భక్తి న
ప్పరమపతివ్రతామణియు భావములోనఁ దలంచె నీశ్వరున్.

చ. శరణు గిరీంద్రజారమణ చంద్రకళాధర కాలకంధరా
శరణు మహాత్మ హేమగిరిచాప మహేశ్వర భక్తవత్సలా
శరణు విరించివిష్ణుముఖసన్నుత భద్రఫలప్రదాయకా
శరణు వియన్నదీధర భుజంగవిభూషణ దీనపోషణా. 239

చ. జయజయ రక్తబీజదనుజాధిప శుంభనిశుంభమర్దనీ
జయజయ ఖడ్గఖేటశరచాపగదాంకుశశూలధారిణీ
జయజయ భోగభాగ్య జయ శాశ్వతభద్రఫలప్రదాయినీ
జయజయ యోగిమానసవశంకరి శాంకరి విష్ణుసోదరీ. 240

క. భువనత్రాణసుధాకర
ధవళాంగకర త్రిశూలధారణ శంభో
శివ శంకర మృత్యుంజయ
భవహర మాం పాహి పాహి భర్గనిధానా. 241

క. జపమంత్రవ్రతనిష్ఠా
తపములు సలుపంగ నోపఁ దథ్యముగ భవ
త్కృప నమ్మియుండెదను నా
యపరాధంబులు సహింపు మార్తశరణ్యా. 242

వ. అని బహుప్రకారంబులం బ్రార్థింపుచు శంఖకాహళఘంటా
రవంబులు చెలంగ ననేకఛత్రచామరకుముదాదిరాజోపచారం
బులం గొంతప్రొద్దు సేవ గావించి తదనంతరంబున శివ
మంత్ర పారాయణమును శివపురాణశ్రవణమునుం గావింపు
చున్నంత. 243

తే. ఇవ్విధంబున నాపార్వతీశ్వరులకు

సురుతరంబుగఁ బూజామహోత్సవంబు
లింపుతోఁ జేసి మఱి విప్రదంపతులకు
సొంపు మీఱఁగఁ బూజ కావింపుచుండె. 244

ఉ. రాజనిభాస్య యానిషధరాజకుటుంబిని భక్తి మీఱ వి
భ్రాజదుమామహేశులుగ భావనఁ జేయుచు నైజమానసాం
భోజమునందు నిశ్చలత భూసురదంపతిపఙ్క్తి కెంతయుం
బూజలొనర్చె భస్మమయపుష్పసుగంధములం బ్రియంబునన్.

క. ఆసమయంబునఁ గృత్రిమ
భూసురదంపతు లటంచు బుద్ధిఁ దెలిసి సో
త్ప్రాసము మనమునఁ దోఁపఁగ
నాసీమంతినియు వారి నారాధించెన్. 246

క. ఒకరుని భవానిగను వే
ఱొకరుని శంకరుని గాఁగ నూహింపుచుఁ దా
నకుటిలమతిఁ బూజించెను
శుకవాణి దరస్మితాస్యశోభిత యగుచున్. 247

క. వనజాక్షి యిట్లు బ్రాహ్మణ
జనములకును షోడశోపచారంబులఁ బూ
జనము లొనరించె మణికాం
చనభాజనభోజనములు సరవి నొసర్చెన్. 248

సీ. శాల్యోదనంబులు సద్యోఘృతంబులు
మొలకబేడలపప్పు మోదకములు
గలవంటకంబు లప్పడములు వడియంబు
లతిరసములు వడ లామవడలు
పరమాన్నములు దేనె ఫలరసప్రకరంబు

లిడ్డైన ల్బులగంబు లడ్డువములు
నూరుబిండులు నల్ల నూరుగాయలు నావ
పచ్చళ్లు పెరుగులు పానకంబు
తే. లాదిగా గలుగుభక్ష్యభోజ్యము లొసంగి
భూసురేంద్రుల కపుడు దాంబూలములును
దక్షిణ లొసంగి యంతఁ బ్రదక్షిణముగ
వందనము లాచరించె నవ్వనరుహాక్షి. 249

శా. శిష్టాచారము తప్పకుండఁగఁ దదాశీరక్షతౌఘంబులన్
హృష్టస్వాంతముతోడఁ గైకొని శుభశ్రీకామయై యంతటన్
మృష్టాన్నంబులఁ దుష్టిఁ జెందినధరిత్రీ దేవతాశ్రేణికిన్
స్వేష్టార్థంబు లొసంగిపంపె మరలన్ హేమాంగి లీలాగతిన్.

క. తదనంతరమున నాసతి
ముదమున మృష్టాన్నపానములఁ బరితుష్టిం
బొదలుచుఁ బతికి హితంబుగ
సదమలమతి నుండె నపుడు సఖులుం దానున్. 251

వ. అంత దేశాంతరసమాగతబ్రాహ్మణప్రకరంబు లారాత్రి యచ్చట వసియించి మరునాఁడు నిజనివాసములకుం జనిరంత నాకృత్రిమదంపతులు పరజనసందర్శనభీతులై యపరరాత్రం బున మేల్కాంచి గృహములకు సత్వరప్రయాణమునఁ జనుచుండి రాసమయంబున. 252

శా. శ్రీరంజిల్లఁగఁ బూర్వరాత్రమున నాసీమంతినీదేవి దా గౌరీశంకరులంచుఁ జిత్తమున సంకల్పించి పూజించుటం దారుణ్యాకృతిభూసురుండు పురుషత్వంబు న్విసర్జించి కాం తారూపంబు ధరించి నిల్చెనపు డత్యాశ్చర్యముం దోఁపఁగన్.

క. ఈరీతిని బ్రభవించిన
తారుణ్యవతీలలామ దర్పకవిశిఖా
సారాహతిఁ బరవశయై
మీఱటె రతిప్రీతి నల సుమేధుని జీరెన్. 254

ఆ. నిలువు నిలువు రమణ నీవు పోవఁగనేల
పుష్పఫలవితానపూర్ణమైన
యీవనంబుఁ జూడు మిచ్చోట వసియించి
కామకేళి నన్ను గారవింపు. 255

ఆ. అని వచింపుచుండ నయ్యింతి వలుకుట
హాస్య మనుచుఁ దలఁచి యాద్విజుండు
పడుచుఁదనముసుద్దు లుడిగి మౌనంబున
రమ్మటంచు సత్వరముగ నరిగె. 256

ఉ. వల్లభ నిల్వుమంచుఁ జెలువంబుగ నడ్డము వచ్చుఁ ద్రోవకు
న్నెల్లనె మాటలాడు దమి మించెఁ దిరంబుగ నాదువాక్యము
ల్లలు గావటంచు బిగి కౌఁగిటఁ జేర్చును మోవి యాను నా
పల్లవపాణి పంచశరభల్లహతి న్నిలుపోప కెంతయున్. 257

క. ఈ తెఱఁగున నాకామిని
చేతోజాతప్రయుక్తచేష్టలు వెలయన్
భూతము సోఁకినరీతిని
గోఁతికి శివమెత్తినట్లు కొంత నటించెన్. 258

వ. ఇట్లు కామోన్మాదంబునఁ బ్రవర్తించునయ్యింతిం గనుంగొని సుమేధుండు నిజకృతం బయినరహస్యకార్యము ప్రకాశం బగునో యనుతలంపున భయమును జెంది యిట్లనియె. 259

మ. తగునే యిట్లు కుచేష్టలం బడఁగ నిత్యబ్రహ్మచర్యుండవై

తగ సారస్వతవిప్రనందనుఁడవై తర్కాగమామ్నాయపా
రగమేధానిధివై జితేంద్రియుఁడవై రంజిల్లునీవిట్లు దు
ర్భగకాంతాకృతి సంచరింప నగరే బంధుద్విజగ్రామణుల్. 260

చ. పురుషుఁడవెంచిచూడ ననబోఁడివిగావు విగర్హితోక్తులన్
సరసము లాడఁగాఁజనదుచయ్యన బోవుదమన్న నింతి భూ
సురసుతుఁజూచి పల్కెఁబురుషుండనుగాను వధూటి గానిన
న్నరయుము నేనుసోమవతినంచునుజూపెనిజాంగకంబునన్.

వ. ఇట్లు చూపిన. 262

మ. తరుణీరూపవతిన్యథార్థవిలసద్ధమ్మిల్లతుంగస్తనిన్
హరిణీలోచనఁ జంద్రబింబవదనన్ హార్యక్షమధ్యాంచితన్
హరినీలాలకవిద్రుమాధరగరీయశ్శ్రోణి నత్యంతసుం
దరి నాసోమవతి న్గనుంగొనియె నద్ధాత్రీసురుం డంతటన్. 263

క. కని యత్యాశ్చర్యంబును
ఘనతరభీతియును దోఁపఁ గంపితగాత్రుం
డును నతిచంచలచిత్తుం
డును నై యతఁ డూరకుండె దుర్ముఖుఁ డగుచున్. 264

వ. ఇవ్విధంబున నేమియుం దోఁచక వెఱఁగుపడి యున్న యాద్విజకుమారునిం గాంచి నిజానురాగంబునఁ గామోన్మాదంబు దోఁప నవ్వారారోహ వెండియు ని ట్లనియె. 265

సీ. మదనసుందర నీవు మౌనముద్ర వహించి
చిత్తంబు వెలయ భాషింపవేమి
దైవకృతం బిది తప్పింప వచ్చునే
యనుభవింపకతీర దజునకైన
వంచకుఁ డైనభూవరుని జేరఁగ నేల

దంపతివేషము ల్దాల్ప నేల
మనము వల్దనక సమ్మతమంది రా నేల
యమ్మానినిసమక్ష మరుగ నేల
తే. యాపతివ్రత యిది సిద్ధ మగునటంచుఁ
జిత్తమున నెంచి యిట్లు పూజింప నేల
నంతమాత్రన యిటులౌట యద్భుతంబు
లింతయుఁ బురాకృతం బని యెఱుఁగవలయు. 266

క. భువిలోన ధూర్తమానవు
లెవ్వరైనను గాని పరులగొడలను నతికై
తవ మొనరించినమాత్రన
నవితథముగ ధాత్రి నశ్యు లగుదురు వారల్. 267

క. మనమందిరమున కిప్పుడు
మన మరిగినఁ బురుషభావ మగపడకున్న
న్మనవారియనుమతంబున
మన మిద్దఱమును వివాహ మాదము నెమ్మిన్. 268

ఆ. చింతసేయవలదు శివునిపాదము లాన
సమ్మదముగ నుండు నెమ్మనమునఁ
గాఁగలట్టిపనులు గాకమానవటంచుఁ
బలికి యంత వలపు నిలుపలేక. 269

వ. వెండియు నమ్మహీసురకుమారునితో నమ్మానిని యిట్లనియె.

చ. జనరహితంబు పుష్పఫలసంయుతమంజునికుంజపుంజరం
జనము మయూరకీరపికషట్పదముఖ్యసమస్తపక్షిని
స్వనితముఁ గామినీపురుషసంగమయోగ్యనివాస మైనదీ
వనమిటు చూడుమిందు రతివల్లభకేళి చరింత మొప్పఁగన్.

వ. అని పలికి. 272

ఉ. అంగజుఁ డేయుపుష్పవిశిఖాహతి కోర్వఁగలేక యాత్మను
ప్పొంగుచు లజ్జఁ బోవిడిచి మోహాభరంబును జెంది యప్పుడ
య్యంగన ప్రాణనాథుమధురాధరమున్మనిపంటనొక్కి యా
లింగన మాచరించెఁ దరళీకృతచిత్తము తత్తరింపఁగన్. 273

వ. ఇవ్విధమున నతిశయప్రేమాతిరేకంబునం బయిం బడి
యున్నయమ్మానిని నాభూసురసుతుండు సాంత్వవచనమ్ముల
నెట్టకేలకు ననునయించెఁ గ్రమ్మఱ నవ్విప్రమిథునంబు నిజ
గృహములకుం బోవుచు నహో సీమంతినీప్రభావంబు
మహాశ్చర్యకరంబని మనంబునం బొగడుచుఁ జనిరంత. 274

క. గృహమున కేతెంచిన తన
దుహితను వీక్షించి కినుక దోఁప గురుండు
న్మహిళారూపం బేమని
యహితోక్తుల నడుగఁ జెప్పి రాద్యంతంబుల్. 275

క. వినినంతమాత్రలోన
జ్జనకులు సక్రోధు లగుచు సరభసముగ నా
జనపతికడ కరుదెంచిరి
తనయాన్వితు లగుచు మదిని దత్తరపడుచున్. 276

వ. అంత నాభూవరుం జూచి సారస్వతుం డిట్లనియె. 277

శా. శుద్ధశ్రోత్రియు మత్కుమారు గతదోషున్గామినీవేషస
న్నద్ధుం జేసినకారణంబునఁ దగ న్నారీస్వరూపంబు దా
సిద్ధంబయ్యెఁ దదేకపుత్త్రకుఁడనై జీవింప నెట్లోర్తు నీ
యుద్ధారంబిటులయ్యె నీవు కపటోద్యోగుండవుర్వీశ్వరా.

క. మౌంజీదండకమండలు

రంజితవటుచర్య లుడిగి రమణీమణియై
మంజుతరభూషణాహారి
ద్రాంజనసిందూర కాదు లమర ధరించెన్. 279

క. సుతహీనులైనవారల
పితరులు పరికింప లుప్తపిండోదకులై
సతతము నిరాశు లగుదురు
క్షితివర మద్గతికి నేమి చెప్పెదొ చెపుమా. 280

తే. స్నానసంధ్యాదివిధులును జపతపములు
వేదపారాయణంబులు నీటఁ గలిపి
నాతిచందంబుఁ దాల్చిన నాదుసుతున
కెట్లు గతిగల్లు రాజ నీ వెఱుఁగఁ బలుకు. 281

వ. అని బహుప్రకారంబుల నిష్ఠురభాషణంబు లాడుచున్న సారస్వతునివాక్యంబు లాకర్ణించి యాభూపాలుం డతివిస్మయ మానమానసుండయి తనమనంబున నిట్లని వితర్కించె. 282

మ. పరిహాసార్థముగాఁగ నీద్విజసుతుఁ భామాకృతిఁ బంపినం
బురుషత్వంబుఁ బరిత్యజించి సతియై పొల్పొంద విచ్చేసెఁ గ్ర
మ్మఱ నౌరా గిరిజామహేశ్వరులసామర్థ్యంబుఁ దద్భక్తభా
సురమాహాత్మ్యము లెంచిచూడ భువిలోఁ జోద్యంబులై కన్పడున్.

కఁ సీమంతినీప్రభావము
లేమని వర్ణింపఁ బురుషుఁ డెంతయుఁ దలఁపఁ
సీమంతినియై నిలిచెను
నామగువతపంబు లెన్న నజునకు వశమే. 284

సీ. అని వితర్కింపుచు నావిదర్భాధీశుఁ
డాప్తమంత్రులు దాను నాక్షణమునఁ

దాపసో త్తము భరద్వాజుని రప్పించి
యమ్మహామునినాథుననుమతమున
నావిప్రు లిరువురు నాత్మజయుతముగాఁ
దనవెంట రా నతిత్వరితగతుల
నంబికాదేవిగృహంబున కేతెంచి
యారాత్రి గౌరీసమర్చనంబుఁ
తే. జేయ సమకట్టి యమ్మహీనాయకుండు
విగతభోజనపాననివేశుఁ డగుచు
ధీరమతి నమ్మునీంద్రోపదేశమునను
విహితనిష్ఠాసమాధిఁ గావింపుచుండి. 285

దండకము. శ్రీమన్మహాదేవురాణీ నతేంద్రాణి రుద్రాణి శర్వాణి కల్యాణి దాక్షాయణీ శూలపాణీ పృథుశ్రోణి ధూమ్రాక్షసంహారిణీ పారిజాతప్రసూనాంచితస్నిగ్ధవేణి లసత్కీరవాణీ భవానీ శివా శాంకరీ రాజరాజేశ్వరీ గౌరి శాకంభరీ కాళి కంకాళి రాజీవనేత్రీ సుచారిత్రి కల్యాణగాత్రీ మహాదైత్యజైత్రీ నగాధీశపుత్త్రీ జగన్మాత లోకైకవిఖ్యాత గంధర్వవిద్యాధరాదిత్యకోటీరకోటీస్ఫురద్దివ్యమాణిక్యదీప ప్రభాత్యుల్లసత్పాదకంజాత కేయూరహారాంగదాది జ్వలద్భూషణవ్రాతకౌమారి మాహేశ్వరీ నారసింహీరమా వైష్ణవీ శాంభవీ భారతీ భైరవీ దుర్గ కాత్యాయనీ పార్వతీ నీదు సామర్థ్య మెన్నంగ బ్రహ్మాదులున్ శేషభాషాదులున్ జాలరేనెంతవాఁడన్ బ్రశంసింప నేతజ్జగజ్జాలనిర్మాణసంరక్షణారంభసంరంభకేళీవినోదంబులున్ గల్గి వర్తింతు వెల్లప్పుడో యాదిశక్తీ పరంజ్యోతి నారాయణీ భద్రకాళీ శుకశ్యా

మలా భ్రామరీ చండికా లక్ష్మివిశ్వేశ్వరీ శాశ్వతైశ్వర్య
సంధాయినీ యంచు నిన్నెంతయుఁ సన్నుతుల్సేయులో
కాళికీ సంతతాఖండదీర్ఘాయురారోగ్యసౌభాగ్యసంసిద్ధిఁ
గావింతు వశ్రాంతముఁ రక్తబీజాదిదైతేయులఁ ద్రుంచి
బృందారకశ్రేణి రక్షింతు వీవెప్పుడుఁ నారదాగస్త్యశాం
డిల్య మాండవ్యమైత్రేయ జాబాలికణ్వాదిమహానీంద్రు
లత్యంతనిష్ఠాగరిష్ఠాత్ములై హృత్సరోజంబులఁ ధ్యానము
ల్సేయుచుఁ బూజఁగావింతు రంతర్ముఖత్వంబునం జంద్ర
ఖండావతంసా భవద్దివ్యరూపంబు బ్రహ్మాండభాండంబులె
న్నిండి వెల్గొందుఁ నేతత్ప్రపంచంబు సర్వంబు నీవై ప్రవ
ర్తింతు వీసూర్యచంద్రాదులుఁ భూజలాకాశవాతాగ్ని
జీవాత్ములు న్నీవ నీకంటె వేఱైన దింకైనయుఁ లేదు
యుష్మత్కటాక్షార్హు లైనట్టివార ల్గదుఁ ధన్యులై
మాన్యులై పుణ్యులై గణ్యులై యుందు రీధాత్రిలో నేను
మూఢుండ గర్వాధిరూఢుండ దుశ్చిత్తుఁడఁ మత్తుఁడఁ
జ్ఞానహీనుండ దీనుండ నేఁజేయు నేరంబులం గాంచి రక్షిం
పఁగా భారమే తల్లి సద్భక్తమందారవల్లీ నమస్తే శరచ్చంద్ర
బింబాననాయై నమస్తే శశాంకారుణప్రజ్వలత్కుండలాయై
నమస్తే పరిత్రాతభూమండలాయై నమస్తే విపద్ధ్వాంతభాను
ప్రభాయై నమస్తే పరిధ్వస్తతాపత్రయాయై నమః కామ
దాయై నమో ముక్తిదాయై నమశ్చండికాయై నమస్తేఽంబి
కాయై నమస్తే నమస్తే నమః.

కవిరాజవిరాజితము.—

జయజయ పార్వతి శంభుకుటుంబిని చారునితంబిని కంబుగళే

జయజయ విద్రుమబింబఫలాధరి చక్రసహోదరి పీనకుచే
జయజయ శాంకరి సాధువశంకరి శత్రుభయంకరి మానినుతే
జయజయ శుంభనిశుంభనిషూదని సత్యవినోదిని శాంతిరతే.

తే. అనుచు వినుతులు చేయుచు నన్నరేంద్రుఁ
డుపవసించెను దద్విప్రయుతముగాఁగ
మూఁడహోరాత్రములు మౌనముద్రఁదాల్చి
భక్తి వెలయంగ నంజలీబద్ధుఁ డగుచు. 288

వ. ఇట్లున్న సమయంబున. 289

సీ. రాకేందుబింబవిభ్రాజితాస్యముతోడ
ధవళాంబుజాతనేత్రములతోడఁ
గటిభాగశోభితకనకాంబరముతోడ
డమరుత్రిశూలఖడ్గములతోడ
గళవిరాజన్మణిగ్రైవేయములతోడఁ
జంద్రావతంసమస్తకముతోడ
సౌదామినీపుంజసన్నిభప్రభతోడ
మహితలావణ్యవిగ్రహముతోడ

తే. హారమంజీరకటకకేయూరముఖ్య
భూరిభూషణరాజివిస్ఫూర్తులొలయ
నిర్భరకృపాప్తితోడ విదర్భపతికి
నంబికాదేవి యపుడు ప్రత్యక్షమయ్యె. 290

తే. ఇట్లు సాక్షాత్కరించినయిందుమౌళి
గేహినికి వందనముచేసి కేలుదోయి
ఫాలభాగంబున ఘటించి ప్రముదితాత్ముఁ
డగుచునూరకయుండె నయ్యవనివిభుఁడు. 291

వ. ఇట్లు వినయవినమితశిరస్కుఁడై యున్న యారాజున కంబి
కాదేవి యి ట్లనియె. 292

క. ఏమిటికై ప్రార్థించితి
వేమి భవత్కామితంబు లెఱిఁగింపుము నీ
కామోదంబున నొసఁగెద
నామాట నిజంబుగాఁగ నమ్ము మధీశా!. 293

చ. అనిన ధరాధినాథుఁ డను నంబికతో జగదేకరక్షణీ
వినుము ద్విజేంద్రనందనులు వేడుకఁ గృత్రిమదంపతిత్వముం
బనుపడ నైషధేంద్రుసతిపాలికిఁ బోయిన నావధూటి ని
న్ననమలరం భజించుకతనన్ లలనామణియయ్యె నొక్కఁడున్.

క. దేవీ సారస్వతునకు
నీవిప్రుం డొకఁడె పుత్త్రుఁ డీయెఁ నాఁగన్
భావింప మరలఁ బురుషుని
గావింపు మటన్న రాజుఁ గనుఁగొని పలికెన్. 295

క. ఈవరముదక్క మఱియొక
ఁటేవరమైనం దలంప నిత్తు నిజముగా
భూవర వేఁడు మటంచన
నావసుధేశుండు పలికె నయ్యంబికతోన్. 296

ఉ. నీకిది యేమిభారము గణింపఁగ నోజగదంబ తొల్లియి
క్ష్వాకుసహోదరిం బురుషసత్తముఁగాఁగ ననుగ్రహింపవే
లోకులు నన్ను బుద్ధిచపలుం డని నింద యొనర్పకుండఁగా
నీకమలాక్షికి న్నరల నిచ్చులు బుంస్త్వ మొసంగు శాంకరీ.

క. కపటాత్మకుఁ డితఁడని న
న్నపవాదము చెందకుండ నరయుచు మఱి నీ

కృపకుం బాత్రునిఁ జేయుము
కపిలాదిముని స్తుతాంఘ్రి కమల భవానీ!. 298

సీ. అనుచుఁ బ్రార్థించిన నానృపాలుని జూచి
యంబికాదేవి యిట్లనియె మరల
వినవయ్య నరనాథ వినిపింతు నొకవార్త
సోమవార వ్రతస్ఫూర్తిఁ జేసి
యాపతివ్రత తనయాత్మలో భావించి
భజనం బొనర్చె దంపతులటంచు
ముదితసంకల్ప మమోఘుంబు కావున
నది మాన్ప నలవిగా దజునకైన
తే. నట్లగుటఁ జేసి వీరల కతిముదమున
నెమ్మిఁ గావింపుఁ డిపుడు పాణిగ్రహంబుఁ
భాస్వరఖ్యాతి యైనసారస్వతునకు
నుద్భవించుఁ గులోద్ధారుఁ డొకసుతుండు. 299.

క. అని యానతిచ్చి త్రిభువన
జనని తిరోధాన మొందె సారస్వతుఁడుం
దనమనమున వెఱఁగందుచు
జనితానందుండు నిర్విచారుం డయ్యెన్. 300

ఆ. గాఢభక్తి నంబికాదేవి మెప్పించి
వాంఛితంబు దీర వరము వడసి
భూసురోత్తములను పూర్ణకాములఁ జేసి
చనియె నృపతి తనదు సదనమునకు. 301

క. పరివారవిరహితుండై
హారుపత్ని వరంబునకుఁ గృతార్థుం డగుత

న్నరపతిచే నర్చితుఁడై
యరిగె భరద్వాజమౌని యాశ్రమమునకున్. 302

మ. జనము ల్మేలనఁగా జగజ్జననికిన్ సద్భక్తితో మ్రొక్కి పా
వనశీలుం డగుతాపసేంద్రుని భరద్వాజున్ బ్రశంసింపుచున్
మునిసంకాశుని నావిదర్భనృపతిన్ మన్నించి దీవించుచుం
జని రాభూసురు లాత్మగేహములకున్ సంతుష్టచేతస్కులై.

ఆ. ఆసుమేధునకును నాసోమవతి నిచ్చి
పెండ్లిఁ జేసె గురుఁడు ప్రీతి యలర
నావధూవరములు నత్యంతసౌఖ్యంబు
లనుభవింపుచుండి రనుదినంబు. 304

వ. తదనంతరంబున. 305

క. సారస్వతునకు వంశో
ద్ధారకుఁడును సత్కళానిధానుం డగుచున్
గౌరీప్రభావమహిమను
భూరిగుణోదారుఁ డొకసుపుత్త్రుఁడు పుట్టెన్. 306

క. ఈసోమవారసువ్రత
భాసురకథ విన్నపుణ్యపరులకు విజయ
శ్రీసౌభాగ్యశుభంబులు
శ్రీసాంబశివుం డొసంగుఁ జిరతరకరుణన్. 307

వ. అని యివ్విధంబున సీమంతినీప్రభావంబును శంభుమాహాత్మ్యం
బునుం దెలియం బలికిన విని యమ్మహామునులు పరమప్రహృష్ట
హృదయులై సూతుం బ్రశంసించి మఱియును శివభక్తలక్ష
ణంబు లెఱింగింపుమని యడుగుటయును. 308

## ఆశ్వాసాంతము

క. శరణాగతసంరక్షణ
శరణీకృతరజతశైల శంకర కరుణా
వరుణాలయ మహితాంబా
పురమందిర పార్థివేష భువనాధీశా. 309

పంచ:—ధరాధరేంద్రకన్యకానితాంతహర్షవర్ధనా
చరాచరాత్మకప్రపంచజాలరక్షణక్షమా
సురాసురప్రసేవ్యమానశోభితాంఘ్రిపంకజా
పరాపరాత్మ వామదేవ భానుకోటిభాస్కరా. 310

మా:—కుజనఫణిమయూరా కుంభిదైత్యప్రహారా
భుజగనికరహారా పోషితాజాండవారా
వృజినఘనసమీరా విశ్వరక్షావిచారా
రజితగిరివిహారా రాజయోగప్రచారా. 311

గద్యము. ఇది శ్రీరామభద్రకరుణాకటాక్షవీక్షణసమాలబ్ధ గీర్వాణాంధ్రభాషాకవిత్వకళాధురంధర బడగలనాటి కన్నడ వంశపయఃపారావారరాకాసుధాకర ఆశ్వలాయన సూత్ర భారద్వాజసగోత్ర శ్రీధరమల్లె అయ్యవార్యతనయ సూరిజన విధేయ వేంకటరామనామధేయప్రణీతం బైన బ్రహ్మోత్తర ఖండం బనుమహాపురాణంబునందు సీమంతినీ వివాహంబును జంద్రాంగదుండు యమునాజలాంతరాళంబున నాగలోక మునకుం బోవుటయు నందుఁ దక్షకువలన బహుమానప్రాప్తుం డై క్రమ్మఱ నిషధపురమునకు వచ్చుటయు సీమంతినీప్రభావ కథనమును ననుకథలం గల తృతీయాశ్వాసము.



# చతుర్థాశ్వాసము



శ్రీకలితాంబాపురవర
నాకంధినిషంగధరణ నానావిద్వ
ద్భీకరశూలపరశ్వథ
నాకాధిపసామ్రాజ్యచరణ నాగాభరణా. 1

వ. దేవా యవధరింపు మశేషపురాణకథాకథనదక్షుం డయిన సూతుం డమ్మహామునుల నవలోకించి వెండియు నిట్లనియె. 2

చ. వినుఁడు మునీంద్రులార పృథివీస్థలి నెన్నఁగ శ్రీమహేశపూ
జనము లొనర్చుమానవుల సచ్చరితంబులు భుక్తిముక్తిసా
ధనములు జన్మదైన్యభయతాపహరంబులు సర్వలోకరం
జనములు నై యశేషకలుషంబు లడంచును విన్నవారికిన్. 3

క. ఘటనాఘటనసమర్థులు
నిటలాక్షునిభక్తు లతివినిర్మలహృదయుల్
ఘటికాసిద్ధులు వారల
పటుతరమహిమంబు లెన్న బ్రహ్మకు వశమే. 4

క. వరధేనువులకుఁ దృణమును
జెఱకుల కువక మిడినట్లు శివభక్తుల కా
దరణ మొనర్చిన జనులకు
సరయఁగ నది కోటిమడుఁగు లై ఫల మొసఁగున్. 5

వ. అట్లు గావున శివభక్తుల సామర్థ్యంబులు దెలియుటకుం గా నొక్కయితిహాసము గలదు దానిం జెప్పెద సావధానమతుల రై వినుండని సూతుం డిట్లనియె. 6

## సుందరుండను బ్రాహ్మణునిచరిత్ర

చ. సురుచిరహేమరత్నగృహశోభితమైనయవంతికాపురాం
తరమున నొక్కవిప్రుఁడు సదావిషయాభిరతుండు సత్యశౌ
చరహితుఁ డంగనారతుఁడు చంచలచిత్తుఁడు దుర్మదుండు మం
దరుఁడను పేరుగల్గి సతతంబును గాఁపురముండు నచ్చటన్. 7

ఉ. అంగదహారకుండలముఖాభరణంబులు దాల్చి గంధసా
రంగమదప్రలిప్తరుచిరాంగము శోభిల నాపురంబునం
బింగళనాఁ బరంగి కడుఁ బేర్మివహించినదాని నొక్కవే
శ్యాంగనగూడియుండునతఁ డంగజతంత్రములన్నెలంగుచున్. 8

## ఋషభయోగి మందరుం

## డనుబ్రాహ్మణుగృహంబునకు వచ్చుట

తే. స్నానసంధ్యాద్యనుష్ఠానహీనుఁ డగుచు
జాతిమాత్రోపవీతియై సంచరింప
నతనిగృహమున కొక్కనాఁ డరుగుదెంచె
విషమనేత్రకృపాభోగి ఋషభయోగి. 9

వ. అంత. 10

సీ. సిద్ధసేవ్యుఁడు సదాశివమూర్తి యైనట్టి
కృతపుణ్యు ఋషభయోగీంద్రుఁ గాంచి
వేశ్యాసమేతుఁడై విప్రవంశజుఁ డంతఁ
దగ నెదురేఁగి పాదముల కెఱఁగి
యర్ఘ్యపాద్యాదుల నర్చించి ముద మొప్ప
విమలహిరణ్యపీఠమున నునిచి
మృష్టాన్నపానసంతుష్టుని గావించి
తాంబూల మిచ్చుచుఁ దల్పమందుఁ

తే. బండఁ జేసియుఁ దాను తత్పాదపద్మ
యుగము లొత్తుచు నారాత్రిపగలు భక్తి
సేవ గావింప సంతుష్టచిత్తుఁ డగుచుఁ
జెలఁగె నవ్వేళ నాయోగిశేఖరుండు. 11

క. ఈవిధమున నాబుషభుం
డావిటదంపతులచేత నర్చితుఁ డగుచుం
దైవగతినుండి క్రమ్మఱ
నావేకువ నరిగె నమ్మహామహుఁ డంతన్. 12

క. ఈలీలనుండు నాద్విజు
మూలం బెఱిఁగింతు వినుఁడు పూర్వంబున దు
శ్శీలుండై నిజదాసీ
లోలత గలయాయజామిళుం డితఁ డరయన్. 13

వ. అని చెప్పి వెండియు సూతుం డిట్లనియె నివ్విధంబున నా విప్రుండును దదీయవేశ్యయుఁ గొంతకాలంబు వర్తించి తదనంతరంబున విగతప్రాయులై కాలవశతంబొంది రంత నవ్విప్రుఁడును నిజకృతకర్మానుభవంబునకై పునర్జనన మందుటకొఱకు దశార్ణదేశాధీశ్వరుం డగువజ్రబాహుఁ డనురాజున కగ్రమహిషి యైనసుమతి యనుదానిగర్భంబు నాశ్రయించి యున్నంత. 14

క. దుర్భరభారాన్వితయై
గర్భిణియై యున్నసుమతిఁ గని సైఁపక నా
విర్భూతకైతవంబున
నిర్భరగరళాన్న మిడిరి నెలఁతకు సవతుల్. 15

తే. ఘోరతరమైనతద్విషం బారగించి
సుమతి మృతిదప్పె దైవయోగమునఁజేసి
యంత సంతాపదుస్సహం బౌనవస్థ
జెందియుండె మదేభేంద్రమందగమన. 16

శా. ఆలోనొక్కదినంబునందుఁ దనయుం డారాజ్ఞికింబుట్టెను
ద్వేలాక్రందనఘోషణాన్వితుఁడు దుస్తేజుండునై దుస్సహ
క్ష్వేళప్రాప్తమహాప్రణాళి నతివిచ్ఛిన్నాంగుఁడై యుండెనా
బాలుండట్లనయుండు తజ్జననియుఁ బాధాపరీతాత్మయై. 17

క. ఆరాజునిజకళత్రకు
మారులకు విషాపహారణమంత్రౌషధస
త్కారంబు లాచరించిన
నారోగ్యత లేకయుండి రతిదుఃఖితులై. 18

తే. ఇట్లహోరాత్రములు రోద నేచ్ఛఁ దగిలి
యున్నఁ జూచి యసహ్యత యొదవుచుండ
బంధుమిత్రపురోహితప్రముఖజనులఁ
గాంచి నరపతి పల్కె నిష్కరుణుఁ డగుచు. 19

క. ఈరమణీసుతు లతివి
స్తారాంహోజాతరోగతాపవ్యధితు
లీరలకతమున నిద్రా
హారంబులు దూరమయ్యె ననవరతంబున్. 20

క. నరకాలయులై యిచ్చటి
కరుదెంచినవారు వీరి నతిదూరముగాఁ
బరపెద దేశమువెడలఁగ
జిరతరరోగార్తులను విశీర్ణాకృతులన్. 21

## వజ్రబాహుండు తనజ్యేష్ఠభార్యయైన సుమతిని పుత్రసహితంబుగా నరణ్యంబున కనుచుట

వ. అని నిశ్చయించి యాభూనాథుండు కనిష్ఠపత్నీ వ్యాసక్తుండు గావున నిజసారథిం బిలిచి నీ విక్కామినీడింభకుల నరదంబుపై నిడుకొని మనదేశంబు వెడలునంతకుంగొని పోయి విజనప్రదేశంబున వారలం డించి రమ్మని పంచిన వాఁడును "వల్లె" యని రాజశాసనప్రకారంబున బహుయోజనవిస్తారం బయినదూరంబు గొనిపోయి యచ్చటు. 22

శా. క్రూరవ్యాళభయానకంబు బహురక్షోగుహ్యకాభీలముర్వీరచ్ఛన్నము నైనకాఱడవి దుర్వృత్తిన్విసర్జించి నిష్కారుణ్యుండగుసూతుఁడేఁగినమహోత్కంపంబుదీపింపఁగా నారాజాంగన యంతటంజనియెఁగొండారణ్యమార్గంబునన్.

క. ఘోరవ్యాఘ్రమృగాదన
వారణగవయాచ్ఛభల్లవానరఝిల్లీ
దారుణ మగుకాననమున
దారకు నెత్తుకొని చనియెఁ దరళేక్షణయున్. 24

వ. ఇట్లు వాతాతపదుర్గమంబును నిర్మనుష్యంబును వేత్రకీచకవేణుకంటకపాదపలతాకీర్ణంబును నైనయమ్మహారణ్యమార్గంబునంబడి యారాజభామిని ఝిల్లీరవంబులకు నులుకుచు కంకకాకగృధ్రోలూకఘూత్కారంబులకు భయంబు నొందుచు వనమదేభంబులం గాంచి పలాయనంబు నొందుచు వరాహ మహిష జంబుక మార్జాలాది క్రూరమృగసంచారంబులకు వెఱచుచుం జనుచున్న సమయంబున గమనాశక్తయు క్షుత్పిపాసాతురయు శీతవాతాతపక్లాంతయు

క్షురాశ్మకంటకప్రచ్ఛిన్నపాదయు ముక్తకేశియు భయ
భ్రాంతచిత్తయునై ప్రాగ్జన్మదురితకర్మంబుల నిందించుకొనుచు
నిట్టూర్పు లెగయ ధరణీతలంబునం బడుచు లేచుచు మంద
మందగమనంబుల నరుగుచున్నంత. 25

మ. ఒకచో వ్యాఘ్రమహారవంబు లొకచో నుద్దండభల్లూకగం
డకసారంగవృకస్వనంబు లొకచోటన్ భూతబేతాళగు
హ్యకశబ్దంబులు నొక్కతావున మహోద్యద్బ్రహ్మరక్షఃపిశా
చకహుంకారము లాలకింపుచు నికుంజవ్రాతము ల్దూరుచున్.

క. దుర్గమకాంతారమహీ
మార్గంబులు దప్పి మరల మరలం జనుచు
న్నిర్గళితసకలసుఖయై
దుర్గంబు లతిక్రమించి తొయ్యలి యంతన్. 27

శా. ఆరాజాంగన బాలు నెత్తుకొని ఘోరారణ్యదేశంబులన్
ధీరప్రజ్ఞ నతిక్రమించి హయదంతిస్యందనాకీర్ణమున్
దూరీభూతభయంబు సర్వజనసందోహాన్వితం బైనకా
శీరామేశ్వరసత్పథం బొకటి గాంచెన్ దైవయోగంబునన్.

## సుమతి దైవవశంబునం బద్మాకరుం డను వైద్యునిపట్టణంబుం జేరి యతనిచే మన్ననలం బొందుట

క. నరనాథకుటుంబిని యా
తెరువునం జని కొంతవడికి దృఢమతి నానా
వరనారీశోభితమై
మురువగు నొకవైశ్యపురము ముందటం గాంచెన్. 29

క. హాటకరత్నధనంబులం
గోటికిం బడగెత్తినట్టికోమటు లొప్పం

బౌటతలంబున వెలసిన
వేటఁ బ్రవేశించె నపుడు ప్రియము దలిర్పన్. 30

సీ. ఆవైశ్యపురమున కధినాథుఁడై యుండు
పద్మాకరుం డనుభద్రయశుఁడు
గురుకృషివాణిజ్యగోరక్షణరతుండు
ధనవంతుఁ డత్యంతధార్మికుండు
అతనిమందిరదాసి యరుదెంచి యారాజ్ఞి
నీక్షించి యడిగె నీ వెవ్వరనుచు
నడిగినయింతితో నారాజమహిషియుఁ
దనదువృత్తాంత మంతయు వచించె

తే. నంత నావార్త యాలేమ యరసి వచ్చి
సంభ్రమము దోఁపఁగా నిజస్వామితోడ
విన్నవించిన నతఁడు సవిస్మయముగ
నావధూమణి రప్పించి యాదరించి. 31

క. తనవృత్తాంతం బడిగిన
విని యాసతి దనకు సవతి విష మొసఁగుటయుం
దనబాలకునియవస్థయుఁ
దనదుపరిత్యాగమును యథాస్థితిఁ జెప్పెన్. 32

తే. అంత నారాజ్ఞివచనంబు లాలకించి
యావణిక్పతి దనమది నహాహ యెంత
కష్టమొందె నటంచును గాఢచింత
నొంది తలయూఁచి కారుణ్యయుక్తుఁడగుచు. 33

ఉ. అమ్మదిరేక్షణ న్నిజగృహాంతికసీమ రహస్యమైనగే
హమ్మున నుంచి దివ్యశయనాసనభోజనపానవస్త్రమా

ల్యమ్ముల నౌషధక్రియల నాదరణం బొనరించి మాతృసా
మ్యమ్ముగఁబూజనేసెబుధమాన్యుఁడువైశ్యవిభుండునెమ్మితోన్.

ఉ. ఆనిలయంబునందు వసుధాధిపగేహిని యాత్మసూనుఁడుం
దాను వసించి యుండ నిరతంబును వైద్యులఁ బిల్వఁబంచి స
న్మానమొనర్చి వైశ్యపతి నవ్యవిషాపహరౌషధంబు లె
న్నేని యొసంగె వారలకు నిష్కపటంబుగ ధర్మకాంక్షియై.

క. ఎన్ని చికిత్స లొనర్చిన
నున్నతముగఁ బూదిలోనిహోమం బగుచు
న్నెన్నాళ్లకు రుజమానక
క్రన్నన నాశిశువు చనియె గతజీవుం డై. 36

## మృతుం డైనకుమారునిం గూర్చి సుమతి విలపించుట

వ. ఇట్లు విగతప్రాణుండై పడియున్న నిజకుమారుం గాంచి
యారాజపత్ని హాహాకారంబులు సేయుచు నత్యంతవిషా
దంబునఁ బరిదేవనం బొనరింపుచున్న సమయంబున నయ్యా
క్రందనధ్వని విని పురంబునం గలవైశ్యస్త్రీజనంబు లచ్చ
టికిం జనుదెంచి బహువిధంబు లగుసాంత్వనాలాపంబుల
నూరడింపుచుండ నయ్యింతియుఁ దద్దయు ఖేదంబున నా
బాలకునుద్దేశించి. 37

క. హా రాజసన్నిభానన
హా రాజకుమార ధీర హా సుకుమారా
హా రవిసన్నిభ తేజా
హా రమణీయాంగ యనుచు నాక్రందించెన్. 38

ఉ. పాపము లెన్ని చేసితినొ బాలక పూర్వభవంబునందు న
త్యాపదఁ జెందెనిప్పు డహహా విషవేదనచే నితాంతసం

తాపముఁ జెందఁగాని మరణంబు లభింపకయుండ వ్రాసె నే
కాపురుషుండు బ్రహ్మయెటుగానికదాఁ బడదుఃఖవారిధిన్. 39

సీ. తనసపత్నుల కేరికిని లేక నావంటి
పాపిష్ఠి కేల గర్భంబు గలిగెఁ
గలిగిన నేమాయెఁ గాపత్యమునఁ గాంత
లీరీతిని విషాన్న మిడఁగఁ దగునె
ఇడినమాత్రన ప్రాణ మెడలకుండఁగ నేల
బహుతాపవేదనాభార మొదవె
నొదవెనే నిజభర్త యదయుఁడై మనమున
నడవులపాలుగా విడువనగునె
తే. విడిచెఁబో భైక్ష్యవృత్తి జీవింపకుండ
దైవ మీచందమున దయఁ దప్పఁదగునె
యిన్నిటికి మత్పురాకృతం బింతచేసెఁ
గాక వేఱొండు గలదె యోరాకుమార. 40

క. పతిసంత్యక్త ననాథను
గతబాంధవఁ గృపణవిపులకలుషాత్మక న
న్నతిదుగఖాంబుధిఁ ద్రోయుచు
సుత యెక్కడఁ బోతివనుచు శోకించు నెడన్. 41

## ఋషభయోగి సుమతికి దత్త్వోపదేశంబు చేయుట

తే. ఆవధూటివిషాదంబు నపనయింప
శక్తు లెవ్వరు లేకున్న సమయమునను
వచ్చెఁ దచ్ఛోకదుర్వ్యాధివైద్యుఁ డగుచుఁ
బూర్వవర్ణితశివయోగిపుంగవుండు. 42

ఉ. అక్షసరంబుపాదుకలు నంచితభూతివిలేపనంబు రు

ద్రాక్షలు యోగదండమువిరాజితలింగమునొప్పఁ జుండఁ బ్ర
త్యక్షశివావతారుఁ డన దైవగతిం జనుదెంచె యోగిహృ
ద్వ్యక్తుఁడు శైవదీక్షుఁడు మహాత్ముఁడునాఋషభుండులీలతోన్.

ఉ. వచ్చినయోగివర్యునకు వైశ్యవిభుం డెదురేఁగుదెంచి తో
డ్తెచ్చి మహార్ఘ్యపాద్యము లతిప్రియభక్తినొసంగెనంతనా
సచ్చరితుండు రాజసతిసన్నిధికిం గరుణార్ద్రచిత్తుఁడై
వచ్చి సుధాసమంబులగువాక్కుల నిట్లనిపల్కె నెమ్మితోన్.

సీ. భూపాలసతి నీవు భూరిశోకంబునఁ
బొరల నేటికి మూఢబుద్ధి వగుచు
నెవ్వఁడు జనియించు నెవ్వఁడు మృతిఁ బొందుఁ
దెలియఁబల్కుము నాకు తేటపడఁగ
నీదేహసంఘంబు లెంచిచూచిన జల
బుద్బుదంబులక్రియఁ బోవుచుండు
సత్త్వాదిగుణము లచ్చపుమాయతోఁగూడి
సకలశరీరము ల్సంభవించు

తే. సాత్త్వికంబున సురలు రాజసమువలన
మనుజులు మహోగ్రమైనతామసమువలన
మృగచయంబులు పుట్టుఁ దన్మిశ్రములను
దలఁప బహుజంతుకులములై పెలయుచుండు. 45

క. గురుసంసారభ్రమణుల
కరుదే తమపూర్వజన్మకర్మానుభవం
బిరవొందుసురలకైనను
నరు లనఁగా నెంతవారు నలినదళాక్షీ. 46

క. కొందఱు కాలం బనుచును

గొందఱు కర్మం బటంచు గుణము లటంచుం
గొందఱు పంచాత్మక మని
యందురు తనుకారణములు హరినిభమధ్యా. 47

ఆ. జనన మయ్యె ననుచు సంతోషమందరు
మృతినిఁ జెందె ననుచు వెతలఁబడరు
ధీరులైనవారు దేహంబు వీక్షించి
భ్రాంతి నొంద రెపుడు పద్మనేత్రి. 48

క. అవ్యక్తమున జనించును
నవ్యక్తమునంద యణఁగు నామధ్యమునన్
సువ్యక్తముగా నెనయును
భవ్యమతీ తనువు నిమిషభంగుర మరయన్. 49

క. ఎప్పుడు గర్భగతుం డగు
నప్పుడ యాదేహి నాశమందుట సిద్ధం
బొప్పఁగ విధివశగతి నగు
నుప్పతిలుట చచ్చుటయు మహోత్పలగంధీ. 50

ఉ. కొందఱు గర్భదేశములఁ గొందఱు సంభవమైనమాత్రనే
కొందఱుయౌవనంబుననుగొందఱువార్ధకతాదశాలయం
బందుదురెల్లజంతువులు నాత్మభవాంతరకర్మరీతులం
జెంది సుఖాసుఖంబులు ప్రసిద్ధముగాభుజియింతురందఱున్.51

క. పితృమాతృసురతసమయో
ద్గతతేజోరక్తమిశ్రతాజనితంబై
వితతంబై తను వలరును
సతి యనఁగాఁ బురుషుఁ డనఁగ షండుఁ డనంగన్. 52

ఆ. సుకృతదుష్కృతములు సుఖదుఃఖములు మహో

విద్య తీర్థములును విభవములును
ఆయువును శుభంబు లజుఁడు వ్రాసినయట్ల
యనుభవింపుచుండు రఖిలజనులు. 53

క. అనతిక్రమ మగుకర్మము
ఘనతరకాలంబుఁ గడవఁ గారాదు భువిఁ
దనువులు శాశ్వతములుగా
వనయము శోకింపఁ దగునె యబలా నీకున్. 54

ఆ. నిక్క మనరు జనులు నెలఁత స్వప్నంబులు
సత్య మగునె యింద్రజాలవిద్య
యీకళేబరంబు లెన్నిభంగుల నైన
శాశ్వతంబు లౌనె చంచలాక్షి. 55

సీ. నీకు జన్మంబు లనేకంబు లైయుండ
నిప్పు డీవ్యామోహ మెట్లు గలిగె
నెక్కడ జనకుండు నెక్కడ జననియు
నెక్కడ నందనుం డెంచిచూడ
నెక్కడ వల్లభుం డెక్కడ ప్రియురాలు
దైవమాయాకల్పితములుగాక
నిజదేహజమలంబు నీక్షించి సుతుఁ డంచు
కించిద్జ్ఞ వగుచు శోకింపఁ దగునె

తే. రక్తమాంసపురీషమూత్రాస్థినిచయ
పూయమేదోవసాశుక్లహేయ మగుచు
నస్వతంత్రం బశాశ్వతం బయినయట్టి
తనువుపైఁ గాంక్ష సేయుట ధర్మమగునె? 56

క. తపముల విద్యల బుద్ధిని

జపముల మంత్రౌషధముల సత్క్రియల మహా
నిపుణతల నెంతవారికి
విపులం బగుమృత్యుభయము విడుచునె చెపుమా. 57

ఆ. మేనినీడపగిడి మృత్యువు వర్తింప
జనుల కెట్లు సుఖము సంభవించు
వ్యాఘ్రు మెదుటనుండ వనమృగంబులకును
హర్ష మగునె మేత లారగింప. 58

వ. అని చెప్పి వెండియు నమ్మహాత్ముం డి ట్లనియె. 59

శా. ధీరోదాత్తుఁడ నై వచింతు విను సాధ్వీ సంచితాగామిక
ప్రారబ్ధాఘము లెల్లఁ బాయుటకు నశ్రాంతంబు సద్భక్తితో
నారాధింపుము నీమనంబున విరూపాక్షుఁ జగద్రక్షకుఁ
గౌరీవల్లభు నీలకంఠు నభవుఁ గంగాధరుఁ శంకరుఁ. 60

క. అని యానతిచ్చి యిఁక నీ
మనమున శోకోపశమన మయ్యెనొ లేదో
వినుపింపు మనిన యోగీం
ద్రునిఁ గనుఁగొని యింతి పలికె దుఃఖితమతియై. 61

మ. వరయోగీంద్ర భవత్కటాక్షమున భాస్వన్ముక్తి చేకూరె నే
నరయన్బాంధవభర్తృపుత్త్రకులఁ బాయం ద్రోచియేకాంగినై
గరళక్లిష్టశరీరనై తిఁ నిఁక శోకవ్యాకులన్నాన్పఁగా [యల్.
మరణోపాయము చక్క నొండు గలవే మంత్రౌషధప్రక్రి

వ. అట్లు గావున నేను నీబాలకసహితంబుగా నరిగెద మరణో
పాయం బెఱిఁగింపవలయు నని దైన్యరసంబు దోఁపం బలికిన
యారాజపత్ని వాక్యంబు లాకర్ణించి కారుణ్యరసార్ద్రచిత్తుఁ
డై యమ్మహానుభావుండు సకలధర్మజ్ఞుండును గృతజ్ఞుండును

గావునఁ బూర్వోపకారంబుఁ దలంచి మృతుం డయినశిశువు,
సమీపంబునకు వచ్చి. 63

## ఋషభయోగీశ్వరుండు మృతుం డైనరాజకుమారుని బ్రతికించుట

ఉ. భూవినుతప్రభావుఁ డగుపుణ్యుఁడు నాఋషభుండుమంత్రసం
భావిత మైనభూతి కరపద్మమునన్ ధరియించి దీర్ఘని
ద్రావశుఁ డైనబాలుఁ గని తన్ముఖమం దిడి క్రమ్మ అంగ సం
జీవితుఁ జేసె నప్పు డతిచిత్రముగాఁ జనులెల్లఁ జూడఁగన్.

క. మెల్లనె కన్నులు విచ్చుచుఁ
బల్లవితేంద్రియుఁడు నగుచు బాలకుఁ డంతం
దల్లిఁ గనుంగొని మది రం
జిల్లఁగ నాక్రందనంబుఁ జేయందొడఁగెన్. 65

క. చచ్చినబాలుఁడు గ్రమ్మఱ
విచ్చేయుట దలఁప నెంతవింత యనుచుఁ దా
రచ్చటనిగ రేశాదికు
లచ్చెరువుగఁ జూచి రప్పు హర్షము వెలయన్. 66

ఉ. క్రొన్నెలవంటినెన్నుదుటఁ గుంతలము ల్వెలయంగనున్న యా
చిన్నికుమారుఁ గాంచి మది చెన్నెసలారఁ దదీయమాతఁదాఁ
గన్నులహర్షబాష్పములు గ్రమ్మఁగ బాలుని నెత్తి ప్రేమతోఁ
జన్నులు సేపఁ బాలొసఁగి సాధుజ డాకృతి నుండె నయ్యెడన్.

చ. పరమతపోబలాఢ్యుఁడు కృపానిధియాఋషభాఖ్యయోగియ
య్యురుపుర దేహయుగ్మమున నీశ్వరమంత్రపవిత్రభూతిచేఁ
గర మనురక్తి లేపనముగా నొనరించినయంతమాత్ర ని
ష్ఠురవిషవేదన ల్విడిచి శోభితవజ్రశరీరులై రొగిన్. 68

సీ. ఆరాజపత్నియు నారాజనందనుం
డత్యంతరుచిర దేహములు దాల్చి
యింద్రవైభవశతం బినుమడించినభంగి
నతిశయానందసౌఖ్యంబుఁ గాంచి
పాదపద్మములపైఁ బడియున్నయయ్యిం తి
గనుఁగొని ఋషభుండు కరుణదోఁప
బలికె నోవత్స నీ విల చిరంజీవివై
యుందువు సామ్రాజ్యయుక్త మగుచు
తే. నెంతకాలంబు జీవింతు వంతతడవు
నీకు ముదిమియుఁ దెవులును లేకయుండు
నీతనూజుండు విద్యావిశారదు డయిన
దనుక నిచ్చోట నుండుము వనజనేత్రి. 69

క. భద్రాశ్వకృపాపాత్రుఁడు
భద్రయుతుం డగు నటంచు బాలకునకుఁ దా
భద్రాయు వనఁగఁ బేరిడి
భద్రగతిం జనియె యోగపారగుఁ డంతన్. 70

వ. ఇ ట్లమ్మహానుభావుం డైనఋషభయోగీంద్రుండు మృతుం డైనరాజనందనుని మహేశ్వర మంత్రపూత భస్మప్రభావమునఁ గ్రమ్మఱ సంజీవితుం జేసి యథేచ్ఛాగతిం జనియెనని చెప్పి వెండియు నమ్మహామునులకు సూతుం డి ట్లనియె. 71

మ. మునినాథోత్తములార మీరు వినుఁడీముక్కంటిమాహాత్మ్య
మ్మున్ను నేఁజెప్పినవేశ్య పింగళయనంబొల్పారువృాఁబోడిస
జ్జనసంస్తుత్యమహాప్రభావుఁ డగునాచంద్రాంగదక్ష్మాతలే
శునిసీమంతినికిం జనించె మరలక్ష్మి శుంభత్సువర్ణాంగియై. 72

క. ఆకన్యామణి నిషధ
క్ష్మాకాంతునిపుత్త్రి కీర్తిమాలిని యనఁగా
లోకమున వెలసె సౌంద
ర్యాకారవిలాసములను రంభ యనంగన్. 73

క. ఆదాశార్ణమహీపతి
గాదిలిపత్నియుఁ దనూభవసమేతముగా
మోదమున వైశ్యపురమున
సాదరమతి నుండె నపుడు సరసులు వొగడన్. 74

క. ఆబాలుఁడు నానాఁటికి
బ్రాబల్యకళావిశేషపారీణుండై
శ్రీబాలచంద్రుకైవడి
ధీబలయుతుఁ డగుచుఁ బెఱిఁగెఁ దేజం బెసఁగన్. 75

క. ఆరాజకుమారునకును
భూరిగుణుం డైనవైశ్యపుత్త్రకుఁడు మహో
దారుఁడు సునయుం డనువాఁ
డారయ సఖుఁ డయ్యె నచట నతిశయమైత్రిన్. 76

తే. కాంచనాంగదకుండలకంకణాది
భూషణంబులు ధరియించి పొత్తుగూడి
బాలకక్రీడలను జోడువాయకుండు
రనుదినము వైశ్యరాజనందనులు ప్రీతి. 77

శా. ఆవైశ్యప్రభుఁ డంత బాలకులయోగ్యత్వంబువీక్షించిభూ
దేవశ్రేష్ఠులచే యథావిధిగ నాదిక్షా ప్రాప్తసంస్కారులం
గావింపం గురుసన్నిధానమునఁ దత్కాల్పంబు లూహింప నా
నావిద్యాభ్యసనం బొనర్చిరిప్రయత్నంబొప్పనయ్యిర్వురున్.

క. జననాథ తనయునకుఁ ద
జ్జననికి నప్పురిని నిర్విచారత్వమునన్
ఘనమతి నుండఁగఁ గాలము
చనియెం దగఁ బదియు నాఱుసంవత్సరముల్. 79

సీ. చిరతరకీర్తి పూజితపరాశివమూర్తి
జయవర్తి శివయోగిచక్రవర్తి
గతజీవుఁ డగుబాలు బ్రదికించి చనినయా
ఋషభాఖ్యసద్గురుఋషభుఁ డంత
నావైశ్యపురమున కరుదెంచె నొకనాఁడు
ఘనతరస్వచ్ఛందగమన మొప్ప
నమ్మహామహుఁ గాంచి యమ్మాతృతనయులు
భయభక్తివినయసంభ్రమము దనర

తే. నెమ్మనమ్ముల నాత్మదైవమ్ముగాఁగఁ
దలఁపుచుఁ దదీయపాదపద్మముల వ్రాలి
యున్నవారల నతిమైత్రి నూరడించి
యెలమి నారాజతనయున కిట్టు లనియె. 80

శా. బాలా క్షేమమె నీకు నీజననికిం భద్రంబె నీ వెప్పుడున్
శూలిన్ ధ్యాన మొనర్తువే గురులకున్ శుశ్రూష గావింతువే
శీలంబొప్ప వహింతువే చదివితే శిక్షాదికగ్రంథముల్
హేళిన్ మమ్ము దలంతువే సతతమున్ హర్షంబుతో నుందువే.

మ. అనివాత్సల్యము దోఁపఁబల్కఁగసుమత్యబ్జాక్షియాత్మీయనం
దను యోగీంద్రునిపాదపద్మములమీఁదన్ వైచియాబాలకుం
డనఘా యీతనయుండు శిష్యుఁడు భవత్యంబౌరయన్ వీని జీ
వనసంయుక్తుఁగఁ జేసినవాఁడవు గురుస్వామీ కృపాంభోనిధీ.

క. పతిబాంధవవిరహిత నే
నితరం బేమియు నెఱుంగ నీబాలకునిన్
మతిమంతుని గావింపుచు
నతిశయకృప వెలయ మమ్ము నారయవలయున్. 83

వ. అని యివ్విధమునం బలికిన యారాజపత్ని వాక్యంబులకు సంతసిల్లి మహామహుం డైనఋషభ యోగీంద్రుం డారాజనందనునకు సన్మార్గం బుపదేశించి కృతార్థుం జేయవలయు నని మనంబున నిశ్చయించి యక్కుమారు నుద్దేశించి యి ట్లనియె.

**ఋషభయోగీశ్వరుఁడు భద్రాయువునకు సప్తాదశపురాణ రహస్యంబు ఉపదేశించుట**

ఉ. శ్రీగురుదేవహేళనము సేయఁగరాదు పురాణవేదశా
స్త్రాగమధర్మము ల్విడువరాదు మహీసురరాజదేవతా
జ్ఞాగతి మీఱరాదొగి మృష ల్వచియింపఁగరాదు నిత్య మ
భ్యాగతపూజ మాని కుడువంజనరాదు నరేంద్రనందనా. 87

క. గురుగోబ్రాహ్మణపూజా
పరత న్వర్తింపు మెపుడు పరధనములకున్
బరసతుల కాస జెందకు
నిరతసదాచారధర్మనియతుఁడ వగుమీ. 86

క. స్నానజపహోమతర్పణ
దానములను విప్రదేవతాగురుపూజా
మానితకార్యములను నీ
మానసమున నలసవృత్తి మానఁగవలయున్. 87

క. కోపము విద్వేషంబును
జాపము నాక్రోశవృత్తి దంభమును దురా

లాపంబులు పైశున్యము
బాపవిచారములు విడువు భద్రగుణాఢ్యా. 88

క. నిరతము విషయాసక్త
స్ఫురితమనోవృత్తి సాధ్వసూయయు హింసా
పరతయు నాత్మస్తుతియును
బరనింద యొనర్పవలదు పార్థివతనయా. 89

క. అత్యాహార మతిశ్రమ
మత్యాలాపములు మఱియు నతిశయకోపం
బత్యుత్కట మగునిద్రయు
నత్యాకాంక్షయును విడువు మనవరతంబున్. 90

క. జనకశ్వశురసతీగురు
జననీబుధభాషణములు సమ్మద మొప్ప
న్విని విశ్వాసింపుము మది
ననయము నిష్కపటవచన మది నమ్మ దగున్. 91

క. కృపణు ననాథుల వృద్ధుల
నపరాధవిహీను బాలు నబలను భాస్వ
త్కృప వెలయఁగ రక్షింపుము
తపనీయాదికము లొసఁగి దాక్షిణ్యమునన్. 92

సీ. బంధుమిత్రులయెడ భావంబు నిలుపుము
కృపగల్గియుండు దుఃఖితులయందు
సజ్జనులందు హర్షంబు గావింపుము
కుజనులవీక్షింపు కోపదృష్టి
శరణాగతుం డైనశత్రువునైనను
జంపఁగా వలదు నిశ్చయముగాను

యెలమిఁ బాత్రాపాత్ర మెవరైన వేఁడిన
లేదన కిమ్ము దేహోదులైనఁ
తే. దల్లి దండ్రియు గురుఁడు నందనుఁడు విప్రుఁ
డాచరించినయపరాధ మది సహింపు
మాత్మరక్షాపరుండవై యనుదినంబు
నప్రమత్తుండవై యుండు మనఘచరిత. 93
క. కీర్తి మహాభూషణ మగు
కీర్తియ లక్ష్మీకరంబు కృతకృత్యతయుం
గీర్తి శుభంబగుఁ గావునఁ
గీర్తి యుపార్జింపు మెపుడు కృతపుణ్యుఁడవై. 94
తే. హయగజాశ్వరత్న హాటకంబులనైన
నపహరింప ధాత్రి నపయశంబు
విడువవలయు దానిఁ గడుసత్వరంబుగఁ
దృణముగాఁ దలంచి ధీరవర్య. 95
క. గౌరీశ్వర పదభక్తుల
నారాధింపుము ప్రసన్ను లగునట్లుగ సం
సారపయోనిధిమగ్నుల
నారసి వా రుద్ధరింతు రనవరతంబున్. 96
క. ఆయుర్బలధనవిద్యా
శ్రేయఃకీర్తిప్రతాపశీలంబులు క
ర్మాయత్తత వచ్చినచోఁ
బాయక యవి యనుభవింపు భవ్యవిచారా. 97
క. కాలము దేశము శక్తియుఁ
దా లెస్సగ దెలిసి చేయఁదగుకార్యము నా.

ర్యాలోచనపూర్వకముగ
మేలగు నెచ్చోటనైన మితహితవచనా. 98

క. జపహోమస్నానంబులఁ
దపములఁ బితృకార్యములను దత్పరమతివై
చపలత్వ ముడిగి యుండుము
కపటం బించుకయు లేక కలుషవిదూరా. 99

క. దాక్షిణ్యసమేతం బ
ల్పాక్షర మధికార్థ మశఠ మతిహృద్యతరం
బక్షీణ మసందిగ్ధము
దక్షం బగుపలుకువలుకఁ దగుఁ దథ్యముగన్. 100

క. ఆపదలందును శత్రు
వ్యాపారములందు భీతి వలవదు నీకుం
బాపములకు గురువిప్ర
లాపములకు వెఱచి యుండు లాలితబుద్ధిన్. 101

సీ. పరుల నెవ్వరినైన బాధింపకుండుము
పరులబాధ లడంపు కరుణ వెలయఁ
జోరదుష్టారినివారణం బొనరింపు
బాహ్యనేహసుషుప్తిఁ బరఁగవలదు
బంధుమిత్రజ్ఞాతిభార్యాసుతాతిథి
భోజనంబుల సమబుద్ధి వగుము
విద్యాకథాధర్మవిహితవాక్యోపదే
శములందు సతతనిశ్చలుఁడ వగుము
తే. ఏస్థలము సాధువిప్రభూయిష్ఠ మగును
బుణ్యతీర్థంబు లెచ్చోటఁ బొందియుండు

శివనివాసంబు లేభూమిఁ జెలఁగుచుండు
నచట నిలువు మవశ్యంబు హర్ష మొదవ. 102

క. కులటావేశ్యాకాముక
ఖలసంగతదేశముల నొకానొకవేళ
న్నిలువకుము జగత్ప్రభు వగు
నలినాక్షుని మదిఁ దలంపు మశ్రాంతంబున్. 103

క. ఎప్పుడు శాంతియు దాంతియు
నెప్పుడును శుచివ్రతంబు నెప్పుడు ధర్మం
బెప్పుడు జితషడ్వర్గిత
దప్పక వర్తింపు మీవు ధరణీశసుతా. 104

క. యతులకు విప్రులకుఁ బతి
వ్రతలకు వరధేనువృషభరత్నములకుఁ బు
ణ్యతరునదీనిజగృహదే
వతలకు వందన మొనర్పు వాలాయముగన్. 105

ఆ. భక్ష్యభోజ్యలేహ్యఫలపుష్పతాంబూల
వస్త్రభూషణాదివస్తువితతి
శివసమర్పితంబుఁ జేసి యాపిమ్మట
ననుభవింపవలయు ననుదినంబు. 106

శా. భద్రాచారపరుండవై నిరతముం బ్రాహ్మీముహూర్తంబున
న్నిద్రాసక్తిఁ బరిత్యజించి శుచివై నిష్కల్మషత్వంబునన్
రుద్రాణీరమణుం గృపాగుణసముద్రుం శంకరుం శ్రీమహా
రుద్రుం జిత్తమునం భజింపు మతిధీరోదాత్తభావంబునన్.

ఆ. నిర్వికల్పముగను నీ వాచరించిన
స్నానదానహోమజపతపములు

ననుదినంబుఁ దత్ఫలాపేక్ష లుడిగి త
థ్యముగఁ జేయు మీశ్వరార్పితములు. 108

చ. విహరణభాషణశ్రవణవీక్షణభోజనపానదానసం
గ్రహశయనస్థలంబులను రాజకళాధరుఁ బార్వతీపతిన్
గుహజనకున్ వృషధ్వజుని గోత్రశరాసను దేవదేవునిన్
మహితవిచారు నీడుమఁడి మానక నిల్పి భజింపు మెప్పుడున్.

మ. వరపంచాక్షరమంత్రపాఠకులు శైవాచారపారీణు లీ
శ్వరభక్తు ల్బసితత్రిపుండ్రవిలసత్ఫాలప్రదేశాంచితు
లురురుద్రాక్షమణిప్రదీప్తకరయుగ్మ ల్పూజ్యు లైనట్టియా
పురుషశ్రేష్ఠులునిల్చియుందు రెపుడున్ భూతేశులోకంబునన్.

వ. అని చెప్పి వత్సా యివ్విధంబున ననేకపురాణంబులయందు విస్తరింపంబడిన ధర్మసంగ్రహంబు లన్నియు సంక్షేపరూపంబున నీకుం దెలియ ననుగ్రహించితి నింక సమస్తపురాణగుహ్యంబును నశేషదోషహరణంబును బరమపవిత్రంబును సకలశుభప్రదంబును సర్వాపన్నివారణంబును నగు శివకవచం బుపదేశించెద భక్తిపూర్వకంబుగా విను మని భద్రాయు నుద్దేశించి ఋషభయోగీంద్రుం డిట్లనియె. 111

## ఋషభయోగి భద్రాయువునకు శివకవచం బుపదేశంబు చేయుట

క. శివదాహ్వయుఁ డైనసదా
శివునకు వందన మొనర్చి సేమము వెలయన్
శివభక్తుఁడ వగునీకును
శివకవచ ముపన్యసింతుఁ జిత్తం బలరన్. 112

శా. చేతో జాతహరుం బరాత్పరు విభుం జిత్తంబున న్నిల్పి ని

ర్ధూతాఘుండు జితేంద్రియుండును జితక్రోధుండునై లోకవి
ఖ్యాతం బైనపడక్షరంబునఁ గరన్యాసంబుఁ గావించి వాం
ఛాతీతం బగుశైవవర్త్మమున రక్షాసక్తుఁడుం గాఁ దగున్.

ఉ. ఘోరవిపత్పరంపరల గుందుచు దైన్యపతీతవృత్తిసం
సారగభీరకూపమున సైరిభలీల జరించునన్ను ను
ద్ధారితుఁ జేయఁగాతఁ బరతత్త్వమయుం డగుశంకరుండు త
త్తారకనామమంత్రము సదా దురితంబు లడంచుఁ గావుతన్.

తే. అణువులకు నెల్ల నణు వైనయప్రమేయుఁ
డధికముల కెల్ల నధిక మైనట్టివిభుఁడు
దనరు జ్యోతిర్మయానందఘనుఁ డజుండు
చిన్మయాత్ముఁడు నన్ను రక్షించుఁగాత. 115

సీ. భూస్వరూపమున నేపురుషుఁడు సకలప్ర
పంచంబుఁ దాన భరించు నెపుడు
జలరూపుఁ డగుచు నేసర్వజ్ఞుఁ డిలఁ గల్గు
నరులకు సంజీవనం బొనర్చుఁ
గాలాగ్ని రూపుఁ డేకల్పాంతమునఁ ద్రిలో
కము లెల్ల నెవఁడు దగ్ధములు చేయ
వాయురూపమున సర్వవ్యాపి యై యుండు
గగనాకృతిని బూర్ణుఁ డగుచు వెలయు

తే. నట్టిలోకైకనాయకుఁ డష్టమూర్తి
సచ్చిదానందమయుఁడు వృషధ్వజుండు
సలిలవాతాగ్ని బాధలఁ బొలియకుండఁ
జిరకృపాదృష్టి నన్ను రక్షించుఁ గాత. 116

సీ. తత్పురుషాఖ్యుండు తటిదగ్ని వర్ణుండు
పరశుహస్తుఁడు పూర్వభాగమునను
ధక్కాక్షమాలాగ్నిధరుఁ డఘోరాకృతి
దక్షాధ్వరధ్వంసి దక్షిణమున
రాజశేఖరుఁడు సద్యోజాతుఁ డభవుండు
శ్రీసదాశివుఁడు పశ్చిమమునందు
మునివందితుఁడు చతుర్ముఖుఁడు త్రినేత్రుండు
వామదేవుండు తత్పార్శ్వమునను
తే. శుభ్రదేహుఁ డచింత్యుండు శూలపాణి
యుగ్రవిక్రముఁ డీశానుఁ డూర్ధ్వమునను
సకలదిశల విదిక్కుల సంతతంబు
పంచవక్త్రుండు నన్ను రక్షించుఁగాత. 117

మ. శిరముం ఫాలమునేత్రముల్ శ్రవణముల్ జిహ్వానన గ్రీవలుం
గరవక్షోదరకంఠపార్శ్వములు వక్షఃకోశకట్యూరులుం
జరణంబు ల్సకలాంగకంబులు మహారాజస్ఫూర్తి రక్షించునీ
శ్వరుఁ డర్ధేందుధరుండు శంకరుఁడు నీశానుండు లీలాగతిన్.

క. శూలాయుధుఁడు గిరీశుఁడు
కాలాంతకుఁ డైననీలకంఠుఁడు పగలుం
రేలును నను రక్షించును
లాలితకరుణాకటాక్షలక్షితముఖుఁడై. 119

క. చింతితఫలదుఁడు గౌరీ
కాంతుఁడు పరమేశ్వరుం డగణ్యుఁడు బాహ్యా
భ్యంతరదేశంబుల న
న్నంతట రక్షించుఁగాత ననవరతంబున్. 120

తే. నిలిచి కూర్చుండి శయనించి నిదురఁ జెంది
మేల్కనినవేళలను గాలమృత్యుహరణుఁ
డంబికారమణుండు త్రియంబకుండు
ఖండపరశుండు నను వేడ్కఁ గాచుఁగాత. 122

వ. మఱియు నఖిలగిరిదుర్గమమార్గంబులయందు నీలకంఠుండును మహారణ్యప్రవాసంబులవలనఁ ద్రిపురాంతకుఁ డైనమృగవ్యాధుండును దుర్మతాభీలశాత్రవవ్యూహంబులవలన భీషణాట్టహాసపరికంపిత బ్రహ్మాండకోశుం డైనవీరభద్రుండును గరితురగరథ పదాతిసమేత బహుళ రాక్షౌహిణీ శతపరివృతు లైన యాతతాయి సమూహంబులవలన ఖండపరశుం డైన మహాదేవుండును చోరాదిగణంబులవలనఁ ద్రిశూలధారుం డైనయంధకాంతకుండును సింహ వ్యాఘ్ర భల్లూక వరాహాదిక్రూరమృగంబులవలనఁ బినాకపాణి యగువామదేవుం డును దుష్టారిష్టవిషమహోత్పాతవ్యాధులవలన జగదీశ్వరుం డగుసాంబశివుండును నన్ను రక్షించుఁగాక యని పలికి మఱియు నప్పరమేశ్వరు నుద్దేశించి శ్రీసాంబ సదాశివ సకల లోకైకనాయకా సకల జగదుత్పత్తిస్థితిలయకారణా చంద్ర కోటీరా భానుకోటిప్రతీకాశా మృత్యుంజయా విరూపాక్షా వృషభవాహనా నాగేంద్రభూషణా వ్యాఘ్ర చర్మాంబరధరా డమరుత్రిశూలఖట్వాంగ గదా ప్రాసభిండివాల కరవాలపాశాంకుశా ద్యాయుధపరిశోభిత దీర్ఘ భుజార్గళా సార్వకాలంబును మహా బలపరాక్రమ తేజఃకీర్తి సంపన్నుండ నగునట్లుగా ననుగ్రహించి నన్ను రక్షింపుము సర్పవిషబాధల నుపశమనంబు నొందింపుము మదీయచో

రగణంబుల మారణంబుగా విదళింపుము కూశ్మాండ మారీ
గణ బ్రహ్మరాక్షస నివహంబులకు సంత్రాసంబుగావింపుము
క్షుత్తృష్ణాతురుండ నగు నన్ను నాప్యాయనంబు నొందం
జేయుము దుఃఖార్తుండ నగునన్ను నానందుండ నగునట్లుగా
బ్రసాదింపుము మరణభయంబువలన సంజీవితుంగా నొన
ర్పుము నరకభయంబులవలన నన్నుద్ధరింపుము శివకవచం
బున నన్ను నాచ్ఛాదింపుము సదాశివుండ నైననీకు బహు
వందనంబులుగావింతు ననుచు ననేకవిధంబులుగాఁ బ్రార్థింప
వలయు నని చెప్పి వెండియు నారాజనందనునకు ఋషభుం
డి ట్లనియె. 122

సీ. అవనీశనుత విను మతిరహస్యం బైన
  కవచంబు నాచేతఁ గలితమయ్యె
నదియును బాపత్రయధ్వాంతమిహిరంబు
  దారుణాపద్వినివారణంబు
సకలసౌభాగ్యైకసామ్రాజ్యసదనంబు
  పశుపతికారుణ్యభాజనంబు
నీశైవకవచంబు నేకాగ్రచిత్తులై
  హితమతిఁ బఠియింతు రెవ్వరేని
తే. వారు శ్రీసాంబశివునికృపారసమున
నతిశయవ్యాధిమృత్యుభయంబు లుడిగి
చిరతరాయుష్కు లగుచు లక్ష్మీకటాక్ష
పాత్రులై బహుసౌఖ్యము ల్పడయఁగలరు 123

క. కావున భక్తిశ్రద్ధా
ప్రావీణ్యము లొప్ప నీవు పఠియింపుము రా

జ్యావహుఁడ వగుదు విప్రుఁడు
కైవల్యపదంబుఁ జెందఁగాఁ గలవు తుదన్. 124

క. అని యానతిచ్చి క్రమ్మఱ
మనుజేంద్రతనూజునకు సమంత్రకముగఁ ద
త్తనువున భస్మోల్లేపన
మొనరించెను యోగిచంద్రుఁ డుజ్జ్వలకరుణన్. 125

క. అగణితవాత్సల్యమునన్
ద్విగుణీకృతషట్సహస్రదివ్యమదేభేం
ద్రగరిష్ఠబల మొసంగెను
జగతీవరనందనునకు సంయమికరుణన్. 126

ఆ. నిరుపమానకాంతి నిశితధారం బగు
చంద్రహాస మొకటి శంఖ మొకటి
సౌమతేయునకుఁ బ్రసన్నదృష్టి నొసంగి
హితము వెలయ యోగి యిట్టు లనియె. 127

వ. నిఖిలనిగమగుహ్యం బైనశైవకవచం బుపదేశించి నీకు వాత్సల్యంబున ఖడ్గశంఖంబు లొసంగితిం గావున రాజనందనా యేతత్ప్రభావముం జెప్పెద సుస్థిరుండవై వినుము ఈఖడ్గంబు మంత్రతపస్సంభావితమును సునిశితధారమును సకలాధినిషూదనంబును నై యుండు దీనిం గాంచినశాత్రవుండు కృతాంతోపమితుం డయినను విగతప్రాణుం డగు నేతచ్ఛంఖనినాదంబు విన్న పరిపంథిజనులు సన్న్యస్తశస్త్రులును విచేతనులును మూర్ఛాగతులు నై భూతలపతితులగుదు రీసాధనంబులు రెండును బరసైన్యవినాశకములును స్వపక్షసైన్యతేజశ్శక్తివివర్ధనంబులు నై యుండు నీ

విష్ణుహాశైవకవచములవలనను ఖడ్గశంఖప్రభావములవలనను ద్వా
దశసహస్రనాగబలములవలనను భస్మధారణ సామర్థ్యము వల
నను శత్రుభూపతుల బరాజితులంగావించి పిత్ర్యంబయిన
భద్రాజ్యమున కభిషిక్తుండవై యనేకసంవత్సరములు
సామ్రాజ్యభోగముల ననుభవింపఁగలవాఁడ వని యానతిచ్చి
సమాత్మృకుం డయిన భద్రాయువు నాశ్వాసించి మహాను
భావుం డయిన ఋషభయోగీంద్రుండు నయ్యిరువురచేతఁ
బూజితుండయి యథేచ్ఛావిహారమ్మునం జనియె చెప్పిసూతుం
డమ్మహామునీంద్రుల కి ట్లనియె. 128

సీ. మునివరోత్తములార వినుఁ డిమ్మహాశైవ
కవచంబు సర్వరక్షాకరంబు
నిర్మలహృదయులై నిరతంబు సద్వృత్తిఁ
బఠనంబు చేసిన భక్తులకును
బహుతరైశ్వర్యసంపదలు ప్రాపించినఁ
గలుషబృందంబులు దొలఁగిపోవు
సకలశుభంబులు సమకూరు నెప్పుడు
నిష్టార్థసంసిద్ధి నెసఁగుచుండుఁ
తే. బుత్రమిత్రకళత్రాదిభోగభాగ్య
సౌఖ్యములు చెందుఁ జేకూరు సమ్మదంబు
శ్రీసదాశివుకరుణచే సిద్ధముగను
వారలకు సంఘటించుఁ గైవల్యపదము. 129

ఆ. ఆనృపాలసతియు నాత్మజుండును దాను
రాజకళలు వెలుఁగ రమ్యవృత్తి
నద్రిజాకుమారు లట్టులఁ జెలువొంది

విగతశోకు లగుచు వెలసి రపుడు. 130

## వజ్రబాహుని మగధదేశపురాజు జయించుట

శా. ఆదాశార్ణకవజ్రబాహుఁడు స్వరాజ్యం బప్రమాదంబుతో
నాదిక్షత్రచరిత్ర నేలఁగఁ దదీయారాతిరాణ్మాగధేం
ద్రాదేశంబున సైనికాగ్రణులు రాష్ట్రక్షోభకార్యంబు బా
హాదర్పోద్ధతులై యొనర్చిరి జిగీషాయత్తులై యెంతయున్.

చ. పురములు గాల్చి కూపములుపూడిచి పేటలుదోఁచికోటలుక్
ధరఁ బడఁద్రోచి భూరుహవితానముల న్విదళించి గోధనో
త్కరములు సంగ్రహించి వనితామణులం జెరపట్టి సైనికు
ల్దెరువులు గట్టి భూప్రజనతివ్యథనొందఁగఁజేసి రయ్యెడన్.

ఉ. ఆమగధాధినాథుఁ డగు హైమరథుండు దశార్ణభూమికిన్
సామజఘోటకాద్యఖిలసైన్యముతో రణకాంక్షఁ జేరినన్
భీమచమూసహస్రపరివేష్టితుఁడై తగ వజ్రబాహుఁ డు
ద్దామబలుం డెదుర్కొనియెఁ దన్మగధాధిపవాహినీతతిన్.

వ. ఇట్లుభయసైన్యంబులుం దలపడి దేవాసురులవిధంబునం బోరాడుచున్న సమయంబున. 134

మ. గురుశౌర్యుండగువజ్రబాహుఁడులసత్కోదండియై కాండియై
సరథుండై మగధేశుసైన్యముల భాస్వద్బాణవర్షంబులం
గరిగంధర్వరథౌఘమెల్లను విభగ్నంబై ధరం గూలఁగా
బరపెన్ దుస్సహతేజుఁడై సమరభూభాగంబునన్ వ్రేల్మిడిన్.

మ. జవనాజిహ్మగవర్షముల్ గురియు దాశార్ణక్షమాపాలుయు
ద్ధవిధిస్ఫూర్తి సహింపలేక మగధేంద్రవ్యూహ మక్షౌహిణీ
నవకం బుద్ధతిఁ జుట్టుముట్టుకొని సేనానాయకోపేతు న
య్యవనీనాథుని సైన్యముంబొదివె నస్త్రాసారధారాహతిన్.

క. ఘోరారివీరవిశిఖా
సారంబున వజ్రబాహుసైన్యంబున హ
స్త్యారోహక యారోహక
సారథిరథికాదులెల్ల సమసి రనేకుల్. 137

క. వారును బిఱుతివియక తమ
పౌరుషములు మెఱయ మగధపతిసైన్యమునన్
వారణవాజిస్యందన
వీరభటులఁ గూల్చి రపుడు విస్మయ మొదవన్. 138

మత్తకోకిల.—
ఈతెఱంగున రెండుసేనలు హెచ్చుతగ్గులు లేక వి
ఖ్యాతిఁ బోరుచు నుండ నంత దశార్ణయోధులు విద్విష
చ్ఛాత్రబాణపరంపరాహతి జర్జరీకృతదేహులై
భీతులై కకుభాళి కేఁగి రపేతవాహనశస్త్రులై. 139

వ. తదనంతరంబున. 140

క. అలఘుప్రాభవయుతులై
చలమున నమ్మగధరాజసైన్యంబులు దో
ర్బల మెసఁగ దశార్ణునితోఁ
దలపడి పోరాడి రపుడు దర్పోద్ధతులై. 141

ఉ. కొందఱు చాపదండమును గొందఱు కేతువుఁ గొందఱశ్వము
ల్గొందఱు సారథిన్ రథముఁ గొందఱుఖడ్గము ఖేటకంబునున్
గొందఱమందఁజేసి ధరఁ గూల్చి పదంపడి వజ్రబాహునిన్
సందిటఁ బట్టి కట్టిరి భుజాబలశోభితు నాక్షణంబునన్. 142

తే. ఇట్లు బంధించి తెచ్చి నిజేశ్వరునకు
నొప్పగించి తదాజ్ఞచే నుత్సహించి

దండనాయకముఖ్యు లుద్దండవృత్తిఁ
బట్టణంబు చరాచూఱ బెట్టి రపుడు. 143

క. గజవాజిరథోష్ట్రంబుల
నజగోమహిషావికముల నంబరతతులం
గజగమనల హరియించిరి
రజతస్వర్ణధనధాన్యరత్నావళులన్. 144

వ. ఇవ్విధమున నమ్మాగధప్రధానులు రాజభవనముఁ జొచ్చి యందు భాండాగారమునం గల యనేకధనకనక మణిభూషణాంబరములును సువర్ణరజతగజదంతమయమ్ములయిన శిబికాశయనవాహనమ్ములును మొదలయిన సమస్తరాజద్రవ్యము లన్నియుఁ దన్మహిషీసమేతముగా నపహరించి నిర్భయత్వముగా నిజనగరమున కేఁగుచున్న సమయమున నద్దేశంబంతయు నరాజకం బయి మగధసైన్య పరిక్షుబ్ధంబయ్యె నంత బాలవృద్ధవనితాజనంబులు భయాక్రందనంబు లొనరింపుచుఁ బ్రణష్టధనధాన్య పశుభూషణాంబరులయి యథేచ్ఛాగమనములం జనుచుండి రంత. 145

మ. మగధేశుండు దశార్ణదేశముల శుంభద్విక్రమాభీలుఁడై
తగసప్తాంగములన్ హరించె ననువృత్తాంతంబు దేశాగతా
ధ్వగబృందంబు వచింప రాజసుతుఁడా భద్రాయువాలించి
పన్నగరాజప్రతిమానరోషమునజన్యాకాంక్షితోద్యుక్తుఁడై.

## భద్రాయువు మాగధుని జయించి తనతండ్రికిఁ మరల రాజ్యము నిచ్చుట

మ. గురుదత్తోచితఖడ్గశంఖధరుఁడై కోదండభృత్పాణియై
శరసంపూర్ణనిషంగుఁడై కవచియై శౌర్యప్రభావాఢ్యుఁడై

సరథుం డై తగ వైశ్యనందనుఁడుపాసారథ్యముం జేయఁగా
ధరణీభాగము కంప మొందఁ జనియెన్ దాశార్ణకక్షోణికిన్.

చ. ఖగపతి మున్ సుధాహరణ కాంక్షనెపంబున కేఁగుచాడ్పునన్
భృగుపతి కార్తవీర్యపృథివీశు వధింపఁగఁ బోవుపోలికన్
మృగపతి కుంభికుంభములమీఁదికి వ్రాలువిధంబు దోఁపఁగా
మగధపతి న్జయింపఁగఁ గుమారవరుం డరుదెంచె నుద్ధతిన్.

క. చని చని నిజరాష్ట్రంబునఁ
గనుఁగొనియె నపేతవస్త్రకన్యామణిగో
ధనమున్ విద్రావితమును
జనితాక్రందనము నైనసకలజనంబున్. 149

శా. చండక్రోధము మీఱ మాగధులసత్సైన్యంబు సొత్తెంచి కో
దండజ్యారవ మాచరించిసకలాస్త్రంబుల్ ప్రయోగించి యు
ద్దండాటోపముఁ జూపి శత్రుపటలిన్ ధాత్రీస్థలిన్ గూల్చె వే
దండాశ్వధ్వజినీచయంబుల మహోద్యద్విక్రమారంభులన్.

క. వారును గ్రమ్మఱ బహువిధ
దారుణఖడ్గాదిశస్త్రధారాహతిచే
నారాసుతు నొప్పించిరి
సారభుజాశౌర్యధైర్యసంపద వెలయన్. 151

తే. ఇవ్విధంబునఁ జోడరి వా రేయునట్టి
యస్త్రశస్త్రంబు సైరించి హస్తిలీల
భవ్యతరశైవకవచప్రభావమునను
సంగరస్థలి ధీరుఁ డై సంచరించె. 152

క. మఱియును మాగధబలములఁ
గరితురగపదాతిరథనికాయంబుల భీ

కరలీలఁ ద్రుంచి దా నొక
యరదమును గ్రహించె రథికు హతుఁజేసి తగన్. 153

క. ఆరథమున వైశ్యాత్మజ
సారథికుం డగుచు సమరశాస్త్రవిలస
త్సారంగమధ్యమునఁ గం
ఠీరవగతి మెలఁగె నతిదృఢీకృతతనుఁ డై. 154

వ. ఇట్లు రథారూఢుం డైనయారాజకుమారుం గాంచి మాగ
ధులు సహింపనోపక చతురంగబలంబులతోడఁ దలపడిన
సక్రోధుం డయి యాజగజ్జెట్టి శౌర్యోద్రేకంబున భుజ
గంబులం గాంచిన విహంగవల్లభుండునుంబోలె వారల
వెనువెంట నంటం దాఁకి కమలాకరంబునం గేళిసలుపు కల
భంబుచాడ్పున నమ్మొగ్గరంబులోనఁ జొచ్చి బ్రహ్మాండపరి
స్ఫోటితంబుగా సింహనాదం బొనరించి శరాసనంబు సజ్యంబు
గావించి కఠోరనిర్ఘాతప్రతీకాశంబు లైనవత్సదంతశిలీముఖ
భల్లార్ధచంద్రకూర్మనఖరక్షురప్రముఖ ఘోరనారాచపరం
పరలఁ బ్రయోగించి నీరసారణ్యంబుల దహించుదవా
నలంబు తెఱంగున నబ్బలంబులఁ జర్జరీభూతశరీరులం
గావించి బడలువడం జేయుచున్న సమయంబునఁ గూలెడు
తురంగంబులును వ్రాలెడుమాతంగంబులును గ్రుంకెడు
శతాంగంబులును నొరలెడుకాల్బలములును ఖండీభూ
తము లైనమస్తకంబులును నికృత్తంబు లయినకటికంఠ
ప్రదేశంబులును భగ్నంబు లైనజానుజంఘులును తెగిపడిన
బాహువులును శకలంబు లైనసర్వావయవంబులునుదునియ
లైనదివ్యాయుధవిశేషములును విభ్రష్టంబు లైనభూషణ

వ్రాతంబులును విచ్ఛిన్నంబు లయినకేతనచ్ఛత్రచామరంబు
లును విశీర్ణంబు లయినతనుత్రాణంబులును విభిన్నంబు
లయినమురజమృదంగపటహకాహళ నిస్సాణాదికంబులును
వివర్ధమానంబు లయినశోణితనదీప్రవాహంబులును విజృంభ
మాణంబు లయిన భూతబేతాళ కలకలారావంబులును
గలిగి సంగ్రామరంగం బత్యంతభీషణం బై యుండె
నయ్యవసరంబున. 155

క. జన్యంబు సేయ నొల్లక
సైన్యంబును జెంపి మరలెఁ దత్తర మొదవన్
సైన్యేశులు హరిఁ గాంచిన
వన్యేభము లట్లు చని రవారితభీతిన్. 156

ఉ. సైమురథుండు భీతి జను నాత్మ బలంబులఁ గాంచి పల్కె నీ
భీమబలోద్ధతుం డెవఁడొ వీనిమదం బణఁగింతు రండు సం
గ్రామమునందు శూరులు పరాజితు లై చనరా దటంచుఁదా
సామవచఃప్రసంగముల సైనికుల న్మరలించెఁ గ్రమ్మఱన్. 157

వ. ఇట్లు మగధరాజప్రయత్నమున నెట్టకేలకు సైనికులు మరలి
చతురంగబలసమేతు లయి చనుదెంచి యొక్కుమ్మడి
నాభద్రాయుధుం జుట్టుముట్టి యనేకవిధమ్ము లయినశక్తి
శూల పరశ్వథ భిండివాల గదా కుంత తోమర క్షురికా
ముసలాదిసాధనముల నొప్పించిన నతఁ డట్టహాసంబు నేసి
ఋషభయోగీంద్రుం దనమనమ్మునం దలంచి కరాళమృత్యు
జిహ్వాభీలంబును మహోగ్రప్రభాజాలంబును ధగద్ధగాయ
మానమ్మును నైనకరవాలము కేల నమర్చి ఝుళిపించిన దద్ద
ర్శనమాత్రమ్మున శిఖిశిఖాజాలమ్ము డగ్గఱినశలభమ్ములవిధ

మ్మునఁ బంచత్వమ్ము నొందువారును వినమ్రభావమ్ముఁ
జెంది పాదాక్రాంతు లగువారును మహాభయభ్రాంతు లై
గంపమ్మునొందువారును నై యున్నసమయమున వెండియు
నమ్మహాబలుండు రోదసీకుహరపరిపూర్ణమ్ముగా శంఖధ్వానంబు
జేసినఁ దదీయభీషణఘోషణం బాలకించి యమ్మాగధులు
మూర్ఛాగతు లై రథికసారథినిషాదిసాదిపదాతిసహితముగాఁ
బరిత్యక్తశస్త్రాస్త్రు లయి భూతలమ్మున బడియున్నవారలం
గని యతండు ధర్మశాస్త్రమర్మజ్ఞుండు గావున మృత
ప్రాయులు నిరాయుధు లయినపురుషులు వధ్యులుగారని
వారల విసర్జించి రణాంగణమ్మున బద్ధుం డై యున్ననిజ
జనకుని బంధముక్తుం గావించినఁ గ్రమ్మఱఁ దత్పత్నీనివహ
మ్మును దత్ప్రధానబంధుజనపురోహితప్రముఖపౌరజానపద
వర్గమ్మును మఱియును గోవృషాదికమ్మును బంధనిర్ముక్తత
నొందించి విషాదవ్యాకులచిత్తు లయియున్నవారలనందఱ
నత్యంతమధురాలాపమ్ముల ననునయించి యనంతరంబ మదీయ
రాష్ట్రభంగంబుఁ గావించి యుద్ధురాత్ముల మానభంగంబు
చేయుట యుచితం బని నిశ్చయించి. 158

మ. మగధాధీశ్వరుఁ డైనహైమరథుదుర్మానంబుఁ దూలించి వా
జిగజస్యందనతత్ప్రధానసఖిదాసీబంధువర్గంబుతో [డై
మగుడన్ బద్ధునిఁ జేసి తోడ్కొనుచు శుంభద్విక్రమోల్లాసుఁ
నగరద్వారముఁ జొచ్చె రాజసుతుఁ డానందంబు సంధిల్లఁగన్.

తే. లావుచెడి సంగరమున పలాయమాను
లైనయోధులు గ్రమ్మఱ నరుగుదెంచి
జనకబాంధవసచివాదిసహితుఁ డైన

రాజపుత్త్రునిఁ గనిరి హర్షంబు వెలయ. 160

మ. కని యీపుణ్యుఁడు సిద్ధుఁడో ఖచరుఁడో గంధర్వుఁడో
యక్షుఁడో, వనజాతాసనుఁడో హరుండో హరియో
వజ్రోల్లసత్పాణియో, యనుచుఁ సంశయమగ్నచిత్తముల
నత్యాశ్చర్యమునుం బొందుచుఁ, జనులెల్ల న్వినుతించి
రప్పుడు మహోత్సాహంబు సంధిల్లఁగన్. 161

క. మృతసముల మగుడ సంజీ
వితులం గావించె నితనివిక్రమగుణముల్
మతిఁ దలఁప నమానుషములు
జితకాశి యితండు యోగసిద్ధుఁడొ చూడన్. 162

ఆ. ఈమహాత్ముతల్లి హిమశైలకన్యక
యితనితండ్రి శంభుఁ డెంచి చూడఁ
గాకయున్న నొంటిగా నవాక్షౌహిణీ
బలము గెలువ నొరుల కలవి యగునె? 163

వ. అని బహువిధములం బ్రశంసింపుచున్న యాప్తప్రధాన
జనమ్ములతోఁ దనవృత్తాంతము యథార్థమ్ముగాఁ దెలియం
జెప్పి యనంతరంబ విస్మయావిష్టమానసుండును హర్షాశ్రు
బిందుసందోహలోచనుండును నతిశయప్రేమవిహ్వలుండు
నగువజ్రబాహుని సమీపమ్మునకు వచ్చి. 164

క. తనపాదాంభోజములకు
వినయంబున మ్రొక్కి యున్న విఖ్యాతయశో
ధనుఁ గనుఁగొని గాఢాలిం
గన మొనరించె న్గురుండు కౌతుక మొదవన్. 165

క. ఆవజ్రబాహుఁ డిట్లను

నీ వెవఁడవొ తెలియఁ బలుకు నిజముగ మాకున్
దేవుఁడవో మనుజుఁడవో
ధీవర్య మదీయభాగ్యదేవతవొ తగన్. 166

క. శ్రీ మెఱయ భవత్సఖుఁ డయి
భీమాహవరంగమునకు భీతిల్లక స
త్ప్రేమంబుగఁ జనుదెంచిన
యీమంచి స్థైర్యుఁ డెవ్వఁ డేర్పడఁ జెపుమా. 167

సీ. అలఘువిక్రమ నీకుఁ దలిదండ్రు లెవ్వారు
నీదేశ మెయ్యది నిశ్చయముగ
నీస్థైర్య మీశౌర్య మీతేజ మీబలం
బరయంగ నితరులయందుఁ గలదె
దేవాసురమనుష్యదీప్తంబు లైనయ
జగముల గెలువంగఁ జాలు దీవు
నీపూర్వభవకృతానేకపుణ్యంబుల
నభినుతిచేయ నా కలవి యగునె

తే. నాదుపత్నుల హితులను నందనులను
నాదురాజ్యంబు పురము నంతయును విడిచి
నాదుచిత్తంబు నీయంద నాటియున్న
దతిశయప్రేమబంధకం బగుటఁ జేసి. 168

క. అని యడిగిన భద్రాయువు
కనుదమ్ముల హర్ష బాష్పకణములు దొరుగన్
గన జలధరగంభీర
స్వనమున దా నిట్టు లనిరొ జనకునితోడన్. 169

ఉ. ఓయనఘాత్మ వీఁడును నయుం డనువైశ్యతనూభవుండు భ

ద్రాయువు నాపై వేసిన పందెంబును నేనును వీనియింట న
శ్యాయత్తనై ఫలంబున నహర్నిశము న్వసియింతు మెంతయుఁ
శ్రేయము మీఱ మత్కథయ శేషముగా వివరింతు మీఁదటన్.

ఆ. ఇపుడు పోయివత్తు నే వచ్చువఱక నీ
జనని మగధవిభుని విడువవలవ
దనుచు విన్నవించి యాక్షణంబున నేఁగె
సఖుఁడుఁ దాను నాత్మసదనమునకు. 171

వ. అట్లరుగుదెంచి. 172

మ. జననీపాదసరోరుహంబులకు శశ్వద్భక్తితో మ్రొక్కి వ
య్యనఁ దాఁ జేసిన కార్యమంతయును నాద్యంతంబుగాఁ జెప్పిన
న్విని తన్మాతయు హృష్టయై నిజసుతున్వేడ్క నాశీర్వదిం
చెను బద్మాకరుఁడంతఁ గౌఁగిటను జేర్చె న్గౌరవం బొప్పఁగన్.

క. ఈ తెఱఁగున భద్రాయువు
మాతృసమేతముగ వైశ్యమందిరమున వి
ఖ్యాతసుఖంబున నుండెను
చేతోమోదంబు వెలయ శివతత్పరుఁడై. 174

తే. రణములో నొక్కరుండు శాత్రవులఁ గెలిచి
జయము చేకొనివచ్చె నిశ్చయముగాఁగ
గురుకటాక్షంబుఁ జెందిన కుశలమతుల
కవని సాధింపరానికార్యములు గలవె? 175

వ. అంత. 176

## సూర్యాస్తమయవర్ణనము

తే. అపరశార్ణక్షమాపాలు ననుఁగుసుతుని
చండశౌర్యప్రభావంబు సైఁపలేక

భానుఁడు పలాయమానుఁడై పరచె ననఁగఁ
జరమశైలంబుమాటుకు జరిగె నపుడు. 177

క. మాగధుల నిజైశ్వర్య
త్యాగాపయశం బనంగఁ దనరుచు రోధో
భాగంబున నద్దిక్కులఁ
బ్రాగల్భ్యముతోడఁ దిమిరపటలము పర్వెన్. 178

క. దేవజ్యేష్ఠుఁడు రాసుతు
భావికరగ్రహమునకు నభఃపాత్రమునన్
భావించిన ముత్యము లనఁ
గా వెలసె విశుద్ధతారకానికరంబుల్. 179

ఉ. కంతునిమేనమామ శితికంఠునియౌదలపువ్వు సింధుజా
కాంతయనుంగుఁదమ్ముఁడు జగజ్జనరంజనదక్షుఁడు భా
స్వంతునియుద్ది సత్కులశవారిధిముద్దులపట్టి తారకా [నన్.
కాంతుఁడు చందమామ కుతుకంబునఁ దోఁచెను దూర్పుదిక్కు

ఆ. సకలభువనజాలసౌధాగ్రతలమున
వెలుఁగుచున్న హేమకలశ మనఁగఁ
గానుపించె నపుడు గగనేందిరాకర్ణ
కుండలంబు చంద్రమండలంబు. 181

క. భద్రాయువు వరకీర్తి స
ముద్రము దా వెల్లివిరిసి భువనంబుల ని
ర్నిద్రగతి నించెనో యన
భద్రకరజ్యోత్స్న వెలసె బ్రహ్మాండమునన్. 182

వ. ఆసమయంబున. 183

**ఋషభయోగీశ్వరుఁడు చంద్రాంగదునియొద్దకుఁ జని భద్రాయువు నకుఁ గూఁతునిచ్చి వివాహంబు సేయుమని యుపదేశించుట**

క. వృషభధ్వజావతారుఁడు
ఋషభుం డావాత్రయందు ఋషులు నుతింపన్
ధిషణాప్రజ్ఞాబలుఁ డై
నిషధేంద్రునిపురికి వచ్చె నెమ్మి దలిర్పన్. 184

వ. ఇట్లు విచ్చేసిన ఋషభయోగీంద్రునకుఁ జంద్రాంగదమహీపాలుం డెదుర్కొని యభివందనంబులు గావించి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి కనకాసనంబునం గూర్చుండ నియమించి యున్నసమయంబున నన్నరనాథునితో యోగీంద్రుం డి ట్లనియె. 185

సీ. విను నైషధేశ్వర వినుమింతు నొకవార్త
దాశార్ణపతికి భద్రాయు వనఁగ
జనియించి నిజమాతృసహితంబుగాఁ దన
తండ్రి చేతను బరిత్యక్తుఁ డగుచు
నొకవైశ్యపురమున నుండ నంతట గత
ప్రాణుఁ డై యున్నయాబాలు మఱల
సంజీవితునిఁ జేసి శైవధర్మం బుప
దేశించి ధీమంతుఁ జేసినాఁడ

తే. నతఁడు మాగధుఁ గెల్చి జయంబుఁగాంచి
జనకునకుఁ గ్రమ్మఱంగ రాజ్యంబు నొసఁగె
నట్టిరాజాత్మజునకు నీయనుఁగుపుత్త్రిఁ
గీర్తిమాలిని నిమ్ము సత్కీర్తి వెలయ. 186.

క. అని యానతిచ్చి క్రమ్మఱఁ

జనియెను యోగీశ్వరుండు చంద్రాంగదుండుఁ
దనపత్ని యైన సీమం
తిని యనుమతిపడసి యుండె దృఢనిశ్చయుఁ డై. 187

వ. అంత నమ్మహీనాథుండు సుఖనిద్రం జెంది యుండు నాసమయంబున. 188

తే. వాసరాధీశ్వరుండు దా వచ్చునపుడు
జనుల కెఱిఁగించు వాద్యనిస్వనము లనఁగ
జారచోరుల గుండియల్ ఝల్లు మనఁగఁ
గొక్కొరోకో యటంచును గోళ్లు గూసె. 189

సీ. పద్మాకరంబులఁ బద్మముల్ వికసించెఁ
గమనీయతరహల్లకములు మోడ్చెఁ
బరిమళాన్వితశీతపవమానములు వీచెఁ
బక్షులకలకలార్భటులు మించెఁ
జక్రవాకములకు సౌఖ్యంబు సేకూరె
వితతకాపోతహుంకృతులు మించె
దధిమథనప్రణాదంబులు వీతెంచె
వత్సంబు లంభారవముల నెసఁగె

తే. ముదిత భూపాలగౌళాదివిదితరాగ
గీతములు మ్రోసె దేవతాగేహములను
వేదపాఠరవంబులు వెలయుచుండె
లాలితం బైనప్రత్యూషవేళయందు. 190

సీ. యజనాభిరతులు ద్రేతాగ్నులు ప్రణయింప
మునివరేణ్యులు సాఁగి మ్రొక్కుచుండ
అధ్వన్యజనులు దేశాంతరంబుల కేఁగ

